# మలబారు రైతువుద్యమ చరిత్ర

రచన

ఇ. యమ్. యస్. నంబూద్రిపాద్



అనువాదం

జి. సి. కొండయ్య



ప్రజాశక్తి కార్యాలయం
:: బెజవాడ ::

ప్రజాశక్తి ప్రచురణ నెం. 70
జూన్ — 1944

CI

# అంకితం

తండ్రీ, తల్లీ, ఆరుగురు బిడ్డలూ గల ఒక రైతు కుటుంబం నాకు రహస్య జీవితకాలంలో ఆశ్రయమిచ్చి కాపాడింది.

తీవ్రమైన సామ్రాజ్యవాద నిరంకుశ నిర్బంధం సాగే రోజుల్లో కమ్యూనిస్టుపార్టీ అభివృద్ధికీ, రైతు సంఘాభివృద్ధికీ, పై కుటుంబం మాదిరే అనేక రైతు కుటుంబాలవారు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ సాయంచేశారు.

వీరందరికీ నా యీ "మలబారు రైతు వుద్యమ చరిత్ర" ను అంకితం చేస్తున్నా.

— గ్రంధకర్త

1943 - ఏప్రిల్

పదణాలు

ప్రజాశక్తి ప్రెస్
బెజవాడ

# పరిచయం

కామ్రేడ్ శంకర నంబూదిరిపాద్ మలబారులో ప్రసిద్ధిచెందిన దేశభక్తుడు. 1930 - 32 కాంగ్రెసు శాసనోల్లంఘనోద్యమాన్ని ఆర్గనైజు చేసిన ముఖ్యులలో ఒకరు. తరువాత వీరు కేరళరాష్ట్ర కాంగ్రెసుకమిటీకి కార్యదర్శిగా పనిచేశారు. మలబారు రైతు లీయనను మద్రాసు అసెంబ్లీ సభ్యునిగా యెన్నుకున్నారు.

కామ్రేడ్ నంబూదిరిపాద్ కమ్యూనిస్టుపార్టీలో సభ్యుడుగావుండి యుద్ధంవచ్చాక రహస్యంగావుండి, మలబారు రైతువుద్యమాన్ని నడిపించాడు. కేరళరాష్ట్ర కమ్యూనిస్టుపార్టీని నిర్మించాడు. వీరి ఆస్తినంతను ప్రభుత్వం జప్తుచేసింది.

యుద్ధస్వభావం మారిందని గుర్తించాక కామ్రేడ్ నంబూదిరిపాద్ జపాన్ ముష్కరులనుండి భారతదేశాన్ని రక్షించడం దేశభక్తుల ధర్మ మనే నిర్ణయానికి వచ్చాడు. బహిరంగంగావచ్చి ప్రజా యిబ్బందులను తొలగించడానికి, మలబారు ప్రజలను కరువునుండి, అంటువ్యాధులనుండి కాపాడటానికి కృషిచేస్తున్నాడు. లక్ష రూపాయలు విలువజేసే తన ఆస్తినంతను లెనిన్ డే నిధికి యిచ్చివేశాడు. తన కాలాన్నంతటినీ వినియోగించి ప్రజాసేవ చేస్తున్నాడు.

మలబారు రైతువుద్యమ చరిత్రను తెలిపే యీచిన్ని పుస్తకాన్ని కామ్రేడ్ నంబూదిరిపాద్ రచించాడు. ఈ పుస్తకాన్ని అనువదించి ఆంధ్ర పాఠకులకు అందించుతున్నాము.

— సంపాదకవర్గం.

IV

# విషయసూచిక


| | | పేజీ |
|---|---|---|
| 1. | మాస్లో తిరుగుబాటు | 2 |
| 2. | నూతన రైతుపుద్యమ ప్రారంభం | 17 |
| 3. | సామ్రాజ్యవాదయుద్ధం - నిరంకుశ నిర్బంధవిధానం | 45 |
| 4. | ప్రజా యుద్ధంకొరకు ప్రజాసమీకరణ | 61 |

# మలబారు రైతు ఉద్యమ చరిత్ర

దక్షిణ భారతదేశంలో మలబారు రైతు వుద్యమ చరిత్ర దాదాపు 100 సంవత్సరాల చరిత్ర. మలబారులో రైతు వుద్యమ నినాదాలు, ఎత్తుగడ నాయకత్వాలలో మార్పులొచ్చాయి. అన్నిటికన్నా మిన్నయేమిటంటే, రైతు వుద్యమం ఆందోళనా స్థాయిని దాటి ఒక సంఘటిత రైతువుద్యమస్థాయికి వచ్చింది. అయినప్పటికీ వుద్యమంయొక్క భూస్వామ్య వ్యతిరేక స్వభావంలో మార్పురాలేదు. గత శతాబ్ద ఆఖరిదశలోనూ, యీ శతాబ్ద ప్రారంభంనుండీ దినదినాభివృద్ధి చెందుతున్న మధ్యతరగతి, కౌలుదారు రైతుల సంఘటిత ఆందోళనా, 1920 - 21 సంవత్సరాల్లో రాజకీయ చైతన్యంతో సంఘటితంగా, ఏకముఖంగా జరిగిన మాప్లా తిరుగుబాటూ, 1930వ సంవత్సరంలో ప్రారంభమయి యీనాడు యింకా అభివృద్ధి చెందుచున్న ఆధునికవర్గ పోరాటం మొదలయినవాటన్నిటి లక్ష్యం కూడా మలబారును భూస్వాముల ఇనుప పిడికిళ్ళనుండి విడిపించడమే।

# 1. మాప్లా తిరుగుబాటు

భూస్వామ్యవర్గ జెన్మీపీడనకు వ్యతిరేకంగా మొట్టమొదట మలబారులో అసమ్మతిని ప్రకటించినప్రతిష్ఠ పామర ప్రజలైన ఎర్నాడు, వల్లువనాడు తాలూకాల మాప్లాలకివ్వాలి. మాప్లారైతుయొక్క అనాగరికతా, అజ్ఞానాలవల్ల తెల్లవారిచే స్థాపించబడ్డ ప్రభుత్వశక్తినీ, ప్రభుత్వం అమలులోకి తెచ్చినచట్టాలూ, శాసనాలయొక్క చిక్కులనూ అతడు గ్రహించలేకపోయాడు. అందువల్లనే ప్రభుత్వోద్యోగులుచేసే నిరంకుశ చేష్టలకూ, జమీందార్లు, వారి యేజంట్లు సాగించే క్రౌర్యకార్యాలకూ వ్యతిరేకంగా అతడు వ్యక్తిగతంగా తిరుగబడ్డాడు. మాప్లా రైతు తననూ, తన సోదర రైతులనూ ఒక రైతు వుద్యమంలోకి సంఘటితపరచలేదు. ఎందువల్లనంటే, అజ్ఞానంవల్ల అతడు కేవలం తనను తొక్కిపెట్టే జమీందారునో, లేక తనపై నిరంకుశంగా ప్రవర్తించే ప్రభుత్వోద్యోగినో చూడగల్గాడేగాని, యీ నిరంకుశ శక్తుల బలపరుస్తున్న జమీందారీ పద్ధతినిగాని, లేక నిరంకుశ ప్రభుత్వాన్నిగాని గుర్తించలేకపోయాడు. కాని నూతనంగా యేర్పడ్డ నిరంకుశ ప్రభుత్వ పద్ధతికి దాసోహం అనే నిర్వీర్య నీచస్థితికి మాప్లా రైతురాలేదు. కావుననే తనననణచివుంచి, అమానుష బాధలకు గురిచేసి దోచుకుంటున్నవారికి వ్యతిరేకంగా తీవ్రంగా పోరాడారు.

1836 - 98 సంవత్సరాలమధ్య వుత్తరపొన్నానీ.(ఇచ్చట మాప్లాలు ప్రాబల్యంలో వున్నారు) వల్లువనాడు, ఎర్నాడు తాలూకాలలో హిందువులకు వ్యతిరేకంగా మాప్లాలు 45 నేరాలుచేసినట్లు రికార్డుచేశారు. మలబారు వుద్యోగవర్గంలోని చరిత్రకారులు "మాప్లాలు చట్టాన్నిధిక్కరించే మొరటి గుంపు" అనే నిర్ణయాన్ని యిచ్చారు. దీన్ని అనుసరించే, ప్రభుత్వం ప్రజా శాంతిని కాపాడడానికంటూ కొన్ని ప్రత్యేక చట్టాలనుచేసింది. (మాప్లా అవుట్ రేజస్ చట్టం).

జాగ్రత్తగా పరిశీలిస్తే పైన చెప్పబడ్డ నేరాలన్నీ జమీందార్లకూ, వారి యేజంట్లకూ, వారి సేవకులకూ, గ్రామాధికార్లకూ, లేక రెవిన్యూ

వుద్యోగులకూ, పోలీసులకూ వ్యతిరేకంగా జరిగాయని తెలుస్తుంది. అంతే గాక యీ ప్రదేశంలో యించుమించు జమీందార్లు, రాజాలు, దేవాదాయ ధర్మకర్తలు మొదలగువారందరూ హిందువులనీ, మాప్లాలందరూ వారి క్రింద వ్యవసాయంచేసుకొనే రైతులనేది జ్ఞాపకముంచుకోవాలి.

కాని జరిగిన నేరాల్లో కొన్ని మతావేశంతో జరిగాయనేది యెవ్వరూ కాదనరు. ఉదాహరణకు: చరూమా అనే హరిజనులు మొదట మహమ్మదీయ మతం పుచ్చుకుని తరువాత మరల హిందూమతం పుచ్చుకొన్నందుకు మాప్లాలు వారిపై దాడిచేశారు. ఇలాంటివి చాలా అరుదుగాజరిగేవి. ఇచ్చట మనం యింకోవిషయం జ్ఞాపకం వుంచుకోవాలి. మాప్లాలయొక్క దృష్టిని మరల్చడానికీ, వారిలో మత దురహంకారాన్ని రెచ్చగొట్టడానికి మాప్లాల మతగురువులు వుద్దేశ్యపూర్వకంగా పనిచేస్తుండేవారు. మతగురువులు తమ సొంతలాభాల నిమిత్తం మాప్లా రైతులయొక్క జమీందారీ వ్యతిరేక స్వభావాన్ని హిందూ వ్యతిరేకస్వభావంగా మార్చడానికి తంటాలు పడుతుండేవారు. ఈ ప్రయత్నాలలో, ప్రచారంలో అమాయక మాప్లా రైతు పడ్డాడూ అంటే ఆశ్చర్యం యేమీలేదు. నిజానికి ఆశ్చర్యమేమిటంటే, జమీందార్లకూ, నిరంకుశ వుద్యోగులకూ వ్యతిరేకంగా జరిగిన ఘర్షణలతో, మతోద్రేకంతో జరిగిన ఘర్షణలను పోల్చిచూస్తే మత పిచ్చతో జరిగినవి చాలాకొద్ది. మాప్లా రైతుకు సాంప్రదాయంగా వస్తూవున్న అవిద్య, అనాగరికత, మతదురభిమానం మొదలైనవివున్నా, ఆతడు కులాభిమానంకన్నా వర్గచైతన్యం గల రైతు అనేది పై విషయం స్పష్టం చేస్తుంది.

## "లోగాన్" గారి రిపోర్టు

19 వ శతాబ్దపు ఆఖరిదశ భారతదేశచరిత్రలో జాతీయోద్యమానికి వర్తలుగావున్న సివిలు ఉద్యోగులకు ప్రసిద్ధి. వీరిలో ఒకరైన ఎ. ఓ. హ్యూముగారు జాతీయకాంగ్రెసు తండ్రి అని అనిపించుకొన్నాడు. ఇలాగే మొట్టమొదట మలబారు రైతుల జమీందారీ వ్యతిరేకస్వభావానికి ఒక స్వరూపం యిచ్చింది లోగాన్ అనే ఒక సివిలు వుద్యోగి. లోగాన్‌గారిని మలబారు రైతుసమస్యల విచారణకు నియమించింది ప్రభుత్వం. మలబారు

ఘర్షణలపై యితడిచ్చిన రిపోర్టు,గవర్నమెంటు కోరికపై యితడు తయారు చేసిన "మలబారు మాన్యుయల్" అనే చరిత్రాత్మక ప్రకటన మొదలయినవి మలబారులో వ్యవసాయ క్లిష్టస్థితిని తేటతెల్లంచేసే ఉత్కృష్ట ప్రకటనలు.

## "లోగాన్"గారి ముఖ్యనిర్ణయాలేమిటో చూద్దాం

(1) ఇంగ్లీషు న్యాయశాస్త్రజ్ఞులు మలబారులోని భూస్వామ్య విధానాన్ని అర్థంచేసుకోలేదు. వారు బ్రిటీషు భూస్వామ్యపద్ధతినీ,సర్వాధికారాలతోగూడిన ఆస్తిహక్కులనూ గురించిన భావాలను మలబారులోకి దిగుమతిచేసి, భూసంబంధమైన ఆస్తిని సూచించే పదజాలాన్ని, విజాతీయమైన కొత్తఅర్థంతో కప్పిపుచ్చారు.

(2) మలబారులో భూమిపై పరిమితిలేని ఆస్తిహక్కులేమీ వుండి వుండలేదు. జమీందారు రెండురకాల వ్యవసాయదారులతో, అంటే, కౌలుదారులతో, వ్యవసాయకూలీలతో కలసి భూఖామందుగా వుండేవాడు. జమీందారీ హక్కులు కొన్నిహద్దులకు లోనైవుండేవి. బ్రిటిషువారికి శిస్తుకట్టే పద్ధతి మాదిరిగాక వచ్చిన ఫలసాయంలో 3వ వంతు జన్మభోగం క్రింద తీసుకొనేవాడు. కౌలుదారును భూమినుండి తొలగించే హక్కుగానీ, లేక తనవాటాను పెంచే హక్కుగానీ జమీందారు కుండేదిగాదు.

(3) జమీందారు తన యిష్టంవచ్చినప్పుడా రైతును భూమినుండి సాగనంపవచ్చుననీ, తనవాటాను యిష్టమొచ్చినట్లు పెంచవచ్చునని, కోర్టులు యిచ్చిన పరిమితిలేని హక్కులుచూస్తే, యిది కేవలం చట్టానికి తప్పుడు నిర్వచనం యివ్వబడ్డదనే చెప్పాలి.

(4) అంతేగాక, పైనిర్ణయాలు మొదటిరకమైన రాజకీయ,సాంఘిక తప్పిదాలు. నిజానికి మాప్లా తిరుగుబాట్లకు యివే కారణాలు.

(5) తిరిగి కౌలుదారులకు వారి పాతహక్కులను యివ్వడమే పరిష్కారమార్గం. అంటే, శాశ్వతకౌళ్ళు, పాతరేట్ల ప్రకారం శిస్తునిర్ణయం, కౌలుదారుల స్థితిని బాగుపరచడానికి వారికి నష్టపరిహార మివ్వడం జరగాలి.

## కనామాదారు పుట్టుక

ఈ పరిస్థితుల్లో మలబారు సాంఘిక వ్యవస్థలో ఒక కొత్తశక్తి తల యెత్తింది. పురాతన భూస్వామ్య సంఘానస్థయొక్క గర్భంనుండే కొత్త బూర్జువా సంఘ అంకురాలు వుత్పన్నమయ్యాయి. ఈ నూతన సంఘాంకురాలు అంతవరకూ అక్కడక్కడా తలయెత్తుతున్న రైతువుద్యమాలకు ఒక సంఘటితస్వరూపాన్ని, నూతన నాయకత్వాన్ని ఇచ్చాయి.

రాజాలూ, స్థానీలూ (రాజాలక్రింద సామంతులు) బ్రిటిషువారి రాకకు ముందున్న సంఘవ్యవస్థలో రాజకీయ నిర్మాణానికి స్వరూపం యిచ్చారు. నంబూద్రీలు, మతసంస్థలూ సాంఘికవిజ్ఞానానికి స్వరూపాన్ని యిచ్చారు. బ్రిటిషుప్రభుత్వం పై రెండు వర్గాలనూ చావుదెబ్బగొట్టి సంఘంలో రాజకీయంగా, వైజ్ఞానికంగా నూతనమార్పును తెచ్చింది. కాని బ్రిటిషు ప్రభుత్వం తన ఆర్థికనిర్మాణానికి పునాదియైన పురాతన నిర్మాణ వస్తువులను అలానే చెరపకుండా వుంచింది. ఈ నూతనావస్థలోనున్న పరస్పరవ్యత్యాసాలు అప్పుడే తలయెత్తుతున్న బూర్జువా వర్గానికి ప్రాణం బోసి, పెద్ద సాంఘిక విప్లవానికి పునాదిని వేశాయి. నూతన రాజకీయ, వైజ్ఞానిక యంత్రానికి స్వరూపాన్నిచ్చింది పురాతన సంఘావస్థలోని మధ్యతరగతియే. రాజాలూ, స్థానీలూ, నంబూద్రీలు ఇంగ్లీషు విద్యను అభ్యసించనూలేదు, ఇంగ్లీషు ప్రభుత్వంలో వుద్యోగాలు సంపాదించ ప్రయత్నించనూ లేదు. వారికున్న ఆర్థిక, సాంఘిక ప్రాబల్యాన్ని నిల బెట్టుకొంటూ ఇంగ్లీషు విద్యను లెక్కచేయక త్రోసిపుచ్చారు. కాని వీరిపై ఆధారపడి జీవిస్తున్న కౌలుదారులూ, ఇతర ప్రజలూ మాత్రం ఇంగ్లీషు స్కూళ్ళకు వెళ్ళడం, వారిభాష నేర్చుకోవడం, వుద్యోగాలు సంపాదించడం జరిగింది.

ఇదిఒక కొత్తపరిస్థితిని కలుగజేసింది. భూఖామందులు ఆర్థికంగా, సాంఘికంగా దేశంలో ప్రాబల్యంలోవున్నప్పటికీ నూతనంగా వచ్చిన విద్యావంతులయిన యువకులూ, వుద్యోగులు, వారికన్నా రాజకీయంగా, వైజ్ఞానికంగా అభివృద్ధి అయ్యారు. ఏప్రభుత్వ పరిపాలనాపద్ధతి అయితే ఈ నూతన విద్యావంతుల వర్గాన్ని రాజకీయంగా జన్మీలపై ఆధారపడకుండా

వుండేలా చేసిందో, ఆ ఇంగ్లీషు ప్రభుత్వ పరిపాలనా పద్ధతే యీ నూతన విద్యావంతుల వర్గాన్ని ఆర్థికంగా జమీన్‌దార్లపైనా, భూస్వాములపైనా ఇంకా ఎక్కువగా ఆధారపడేలా చేసింది.

తహసీల్‌దారుగాని, పోలీసు వుద్యోగిగాని, లేక ఒక సబ్‌జడ్జిగాని, సామాన్య పౌరులపై అధికారం చెలాయించినట్లుగానే జెన్మీలపైనగూడ అధికారం చెలాయించగల యంత్రంలో భాగాలుగా ఉంటారు. కాని యీ వుద్యోగులంతా ఆర్థికంగా, సాంఘికంగా యేదో ఒక జమీందారుపైనో, లేక భూస్వాములపైనో ఆధారపడి వుండేవారు. వుద్యోగికి సామాన్య ప్రజలపై చలాయించినట్లు యెన్నో విషయాల్లో జమీందార్లపైకూడా అధికారం చలాయించ అవకాశాలున్నప్పటికీ అలా జరిగితే జమీందారు అతడికి నివాసస్థలమే దొరకకుండా చేయవచ్చు. విశాలమైన మానసికతత్వం, తమ గౌరవాన్ని తము యెలానయినా నిలబెట్టుకోవాలి అనే వుద్దేశాలతోవుండే యీ విద్యావంతుల వర్గం, అతినీచమయిన, మోసగాండ్లయిన తమ భూస్వాములముందు ఆత్మగౌరవానికి భంగకరంగా ప్రవర్తించవలసి వచ్చేది. శిథిలావస్థలోనున్న జమీందారీ వర్గానికీ, నూతనంగా దినదినాభివృద్ధి చెందుచుండిన బూర్జువా వర్గానికీ మధ్య పొడసూపిన యీ ఘర్షణయే రైతువుద్యమానికి నూతన నాయకత్వాన్నిచ్చింది. రైతువర్గానికి ఆరోజుల్లో నాయకత్వాన్ని వహించిన ప్రముఖవ్యక్తి శ్రీ శంకరన్‌నాయర్‌గారు.

కాని లోగాన్‌గారు సూచించిన కోర్కెలకూ, లేవదీసిన వినాదాలకూ, పైవర్గం సూచించిన వాటికీ భేదంవుంది. జమీందార్ల వాదనలను వ్యతిరేకించుటకు, వోడించుటకు లోగాన్‌గారిని వుదహరించినా, వారిచ్చిన సూచనలను కావాలనేవారుగాదు.

ఈ భేదానికి మూలం యేమిటో తెలుసుకోవాలంటే ఒక విషయం మనం మనసులో వుంచుకోవాలి. మలబారులో రెండురకాలైన రైతు వర్గాలున్నాయి ఇందులో ఒక వర్గాన్ని "కనామదారు" అంటారు. ఈ వర్గానికి కొన్ని ప్రత్యేక హక్కులున్నాయి. శిస్తు తక్కువ. జమీందార్లకు కొద్దిమొత్తాలను పెట్టుబడికూడా పెట్టేవారు. రెండవవర్గం "వరూంపటాందారు" ఈ వర్గానికి యేలాంటి ప్రత్యేక హక్కులూ లేవు. పూర్తి శిస్తును చెల్లించుకోవాలి. భూమినికూడా సాలుసరి కౌలుమీద వ్యవసాయం

చేసుకోవాలి. కనామాదార్లలో చాలామంది వ్యవసాయకులు కారు. వీరు వీరి భూములను వరూంపటాందారులకు కౌలుకిస్తారు. కాని వరూం పటాందార్లు యించుమించు అంతావ్యవసాయకులు. అందువల్ల కనామాదార్లు నేరుగా జమీందారు క్రిందే వుంటే, వరూపటాందార్లు యిటు జమీందార్ల క్రిందా, అటు కనామాదార్లక్రిందా వుంటారు. ఈ కనామాదార్లు అలానే వుండిపోయారు. నూతనంగా వచ్చిన బూర్జువా వర్గంలోకి జమీందార్ల నుండీ, కనామాదార్లనుండీ కొద్దిమంది వచ్చారు. అందువల్ల కనామాదారు ఆర్థికంగా జమీందారుతో సమానంగా వుండాలని సాగించిన పోరాటం బూర్జువావర్గ ప్రాబల్యంకొరకు సాగించిన పోరాటమే. ఇలా వర్గాధి పత్యంకొరకు ప్రాకులాడుతున్న కనామాదారు వరూపటాందారు తనతో సమాన హోదాలో వుండడానికి ఇష్టపడలేదు. బీదకనామాదారు జమీం దారుతో సమాన హోదాలో వుండేదానికి ధనిక కనామాదారంతగా లెక్క చేశేవాడుగాదు. కాని, వరూం పటాందారు తనతో సమాన హోదాలో వుండేదానికి వ్యతిరేకత తెల్పేవాడు ధనిక కనామాదారు. అందువల్ల కనామాదార్లకు 'శాశ్వతకౌలు'లేక 'జిరాయితీహక్కు'యివ్వాలి. అనే నినాదం లేవదీయ బడ్డది. కాని లోగాన్‌గారు యెప్పుడూకనామాదారుకు సంస్కరణ లేమీ సూచించలేదు. వారి సూచనలన్నీ ఆర్థికంగా నలిగిపోతూవుండిన వరూం పటాందారు కొరకే చేయబడ్డాయి.

ఈ పోరాటం చాలా తీవ్రంగా యెక్కువకాలం జరిగింది. ఈ పోరాటంలో కనామాదారు జయించడానికి ఒక అర్ధశతాబ్దం పట్టింది. తుట్ట తుదకు కనామాదారు జయించాడు. ఈ పోరాటం కేవలం బ్రిటిషు మలబారు లోనే గాకుండా, మలబారులోవున్న కొచ్చిన్, తిరువాన్‌కూరు సంస్థానాలకు కూడా ప్రాకింది. కాని మలబారులో పోరాటం ఆఖరయ్యేముందే అచ్చట పోరాటం అంతమయింది. మళయాళం మాట్లాడే ప్రదేశంలో మూడు రాజకీయ వర్గాలు మూడు రకాలైన ప్రత్యేక చట్టాలను తెప్పించగల్గిన యీపోరాటంయొక్కవివిధస్వరూపాలను యిచ్చట వర్ణించడం అనవసరం.

ఐర్లండు సమస్య లండనులో యెలా 400 సంవత్సరాలు కలవర పరిచిందో, అలాగే మద్రాసు గవర్నమెంటుకు మలబారు టెనెన్సీ సమస్య 50 సంవత్సరాలు యెడతెగని కంగారు కలిగించింది. ఐర్లాండు - ఇంగ్లండు 

సంధి యేలా బ్రిటిషువారి వలసదేశ సమస్యను పరిష్కరించలేదో అలానే మద్రాసు ప్రభుత్వ పరిష్కారమార్గం మలబారు టెనెన్సీ సమస్యను పరిష్కరించలేకపోయింది. అంతేకాదు. 1921 లో జరిగిన ఐర్లండు సమస్య పరిష్కారానికి ముందు 1916 తిరుగుబాటు తప్పనిసరి అయినట్లు, మలబారులో మద్రాసు గవర్నమెంటు 1930 లో చేసిన పరిష్కార చట్టాలకు ముందు 1921 లో మాప్లా తిరుగుబాటు తప్పరిసరి అయి వచ్చింది. ఈ తిరుగుబాటు 1857 తర్వాత భారతదేశంలో జరిగిన బ్రిటిషు ప్రభుత్వ వ్యతిరేక పోరాటాల్లోకి చాల తీవ్రమయింది. ఈ తిరుగుబాటును గురించి క్లుప్తంగా తెలుసుకొందాము.

## మాప్లా తిరుగుబాటు - 1921

దక్షిణ మలబారులో వచ్చిన జమీందారీ వ్యతిరేక వుద్యమ ఫలితమే తుట్టతుదకు 1920–21 లో 5 మాసాలపాటు బ్రహ్మాండమయిన విప్లవ తిరుగుబాటుగా మారింది. ఈ తిరుగుబాటును గురించి అధికారవర్గం "మాప్లాలు కేవలం చట్టధిక్కార అరాచకవర్గం" అనే అర్థంలేని అపవాదులు, అబద్ధాలు వ్రాశారు. అసలు సత్యమేదో చూపడానికి ప్రయత్నిస్తాను. అధికారవర్గ దృక్పథాన్ని సమర్థిస్తూ గోపాలనాయర్, గవర్నమెంటు పెన్షనరు పుస్తకాన్ని వ్రాశారు. ఆనాటి కలెక్టరుగారు యీ పుస్తకాన్ని యెంతో స్తుతించారు.

తిరుగుబాటు ప్రారంభంలో జరిగిన ఘటనలలో ఒకదానిని గురించి వ్రాస్తూ యీ గ్రంథకర్త యిలా అంటాడు.

"నీలాంబూరు తిరుమల్‌పాదుగారి భవనాన్నుండి తుపాకి ఒకటి దొంగిలించబడిందనే కారణంపై పోలీసులు, స్థానిక ఖిలాఫత్‌కు సిటీ కార్యదర్శియైన వి. మహమ్మద్‌గారి యిల్లు సోదాచేశారు. సమయంకొరకు వేచియుండిన మాప్లాలకు ఖిలాఫత్ వుద్యమ బలాన్నీ, అధికారాన్నీ ప్రదర్శించుటకు, పై పని అవకాశమిచ్చింది. సోదాచేయడం, అక్రమం, అనవసరం అనే సాకుతో వందలకొలది మాప్లా రైతులు కత్తులు, కఠార్లు మొదలైన చేతికి దొరికిన ఆయుధాలను ధరించి ఒక్కక్షణంలో గుంపులుగా పోగై భవనాన్ని చుట్టుముట్టేరు. చుట్టుప్రక్కల స్థానికంగా వున్న

మసీదుల్లో తప్పెట్లూ, నగారాలూ మ్రోగించడం ద్వారా యీ గుంపులు ప్రోగయ్యాయని తెలిసింది. కూనీలు చేస్తామని బెదిరించి భూస్వాముల నుండి చోంఖల్కుం (బలాత్కారపు పన్ను) వసూలు చేశారు. వీరితో జాగ్రత్తగా ప్రవర్తించుదామనుకున్న పోలీసు సర్కిల్ ఇనస్పెక్టరును హత్యచేస్తామని బెదరించారు...............

"రైతుల అసంతృప్తియే అని చెప్పడానికి అటువంటి సాక్ష్యమేమీ యింకా రాలేదు. కాని, పూకొట్టూరు ఎస్టేటు మేనేజరు తిరుమల్‌పాదుకూ, పూకొట్టూరు మాప్లాలకూ మధ్య యేదో కొంత పేచీ వున్నట్లు కనపడు తుంది. కాని అది యిదమిద్ధమని చెప్పటం అసంభవం. మేనేజరుద్వారా పోలీసులు చేసిన సోదా వారిని రెచ్చగొట్టింది. ఖిలాఫత్ వుద్యమనాయకుడు. తోటిమతస్థుల యీక్రోధాగ్నినీ, ఖిలాఫత్ వుద్యమాన్నీ ఉపయోగించుకుని, పగ సాధించ ప్రయత్నించాడు. ఆనాటి రాత్రి 9 గంటలప్పుడు మేనే జరును చుట్టుముట్టి, అల్లకల్లోలం చేసి, కూలీ చెల్లించమని మాప్లాలు బెది రించారు. ఎక్కడో అడవిలో కుగ్రామంగావున్న ఆ పూకొట్టూరులో 1921 ఆగస్టు 2వ తారీకునుండి నిజానికి సివిల్‌పరిపాలన ఆగిపోయింది."

ఇదే గ్రంథంలో 30వ పేజీలో, "పరిశ్రమలో మాప్లాతో యెవ్వరూ పోటీ చేయలేరు. సామాన్యజీవితంలో అతడి సత్ప్రవర్తన అంగీకరించ దగింది. ఈ తిరుగుబాటులో హిందువులకు మాప్లాలు సహాయపడ్డట్టు యెన్నో వుదాహరణలున్నాయి. కానిఅవిఅక్కడక్కడాజరిగాయి. ఉద్యమ స్వభావాన్ని మార్చేంతగా జరగలేదు." అనివ్రాశాడు.

ఈ గ్రంథకర్త 76-80 పేజీల్లో తిరుగుబాటు నాయకులను గురించి వ్రాసిన వ్రాతలు అసలు సత్యాన్ని తెలుపుతాయి.

"వారియన్‌కున్నాధ్ కున్హామద్‌హాజీ పేరుపొందిన నేరస్థులకుటుం బానికి చెందినవాడు. ఏదో నేరంతో సంబంధమున్నదని చిన్నతనంలోనే తండ్రితోపాటు శిక్ష విధించబడ్డది. శిక్ష పూర్తిచేసి వచ్చినతరువాత అతణ్ణి స్వగ్రామంలో నివశించనిచ్చారుగాదు. కొంతకాలమైన తరువాత స్వగ్రామం జేరి బండితోలుకుని జీవించడం మొదలుపెట్టాడు.

ఖిలాఫత్‌వుద్యమ ప్రారంభంలో యితడు వుద్యమంలో కలసి పోయాడు. వుద్యమంలో పనిచేస్తున్నవారిలో ముఖ్యుడుగా తయారయ్యాడు. సభలూ, సమావేశాలూ జరుపుతూ ఎర్నాడులో ఖిలాఫత్ వుద్యమనాయకు డైనాడు. తిరుగుబాటు రేగినమీదట యితడు రాజయ్యాడు. ఒక మాప్లా రిజైరుడు పోలీసు వుద్యోగి ఖాన్‌బహద్దర్ చక్కుట్టీ అనే ఆయనను చంపి పట్టాభిషేకమహోత్సవం జరుపుకున్నాడు.

ఇతడు హిందువులకు రాజుగా, మహమ్మదీయులకు మతగురువుగా, ఖిలాఫత్ వుద్యమానికి సేనానాయకుడుగా నటించాడు. ఇతడు ఖిలాఫత్ వుద్యమ యూనిఫారం, బాడ్జి, టర్కీకుళాయి, చేతిలో ఖడ్గం ధరించేవాడు. వల్లువనాడు, యెర్‌నాడు తాలూకాలలో యితడు సంపూర్ణ స్వరాజ్యాన్ని అనుభవించాడు. తనప్రజలు దోపిడీ, దొమ్మీలవల్ల చాలాబాధలు అనుభ విస్తున్నట్లు తనకు తెలుసుననీ, అందువల్ల ఆ సంవత్సరం (1921) యుద్ధ చందాలు తప్ప యేమీ పన్నువసూలు చేయననీ, వచ్చేసంవత్సరం పన్ను తప్పక యిచ్చుకోవలసి వుంటుందనీ, ప్రకటించాడు. తిరుమల్‌పాదుగారి భూమిలోని పంటను ప్రోగుచేసి తెమ్మని వ్యవసాయకూలీలకు వుత్తరువు యిచ్చాడు. దానికి డబ్బుయిచ్చే ఏర్పాటుగూడా చేశాడు. ఆ ధాన్యం తన సైన్యాలకని ప్రకటించాడు. అతడి రాజ్యాన్నుండి వెళ్ళిపోదలచినవారికి వారిశక్తినిబట్టిడబ్బుచెల్లించుకొనిపోయేపద్ధతిపై ప్యాస్‌పోర్టులుయిచ్చాడు."

ఇతడు 1922 జనవరి 6వ తారీఖున పట్టుబడి 20వ తారీఖునకాల్చి, చంపబడ్డాడు.

ఇతడు తిరుగుబాటునాయకులలోకల్లాప్రసిద్ధికెక్కినవాడు. ఇతడికన్నా తక్కువఅంతస్థులో వున్నవారినిగురించి గ్రంథకర్త ఏమంటాడోచూద్దాం. "సీతికోయా తంగళ్" అనే కుమారం పత్తూరు నివాసి తనంతటతాను ఒక ఖిలాఫత్ రాష్ట్రానికి గవర్నరుగా ప్రకటించుకొన్నాడు. దేశం తమ దైంది గావున నాశనకరమైన పనులుగానీ, లూటీలుగానీ చేయరాదంటూ ఫత్వా యిచ్చాడు. ఎలాం పలాసేరీ అనే ప్రదేశంలో దొమ్మీచేసినవారిలో ముగ్గురిని యితడు తన సొంత మిలిటరీ కోర్టులో విచారించి శిక్షలు విధిం చాడు. తప్పుచేసినవారిని కాల్చివేయమని వుత్తరువు యిచ్చాడు. కాని కాల్చకుండా బెదిరించుటకై వుత్తుత్తతోటాలతో కాల్పించాడు. భయకంపితులై

వారు పడిపోయారు. పడి లేచినప్పుడు వారికి గాయాలులేవు. ఇదంతా తన అద్భుతశక్తివల్ల జరుగుతుందనీ, యిదేవిధంగా యింగ్లీషువారి దాడికి తన ప్రజలు చలించరని చెప్పేడు." ఇంతకూ పట్టుకోబడి కాల్చి చంప బడ్డాడు.

"చెంబ్రాసరీ యింబిచ్చికోయాతేన్‌గాల్ తిరూరు, కరువారకుండు గ్రామాల మధ్యనున్న పర్వతప్రాంతంలో తనకోర్టు పెట్టాడు. చుట్టు ప్రక్కల గ్రామాలనుండి 4 వేలమంది అనుచరులను అతను కూడదీశాడు. ప్రభుత్వ సిపాయీలకు పాలు, పండ్లు యిచ్చి సహకారంచేశారనే నేరానికి 40 మందికన్నా యెక్కువ హిందువులను తలలు వెనుకకు విరచి వీపులకు కట్టి యితడికోర్టుకు తెచ్చారు. వీరిలో 38 మందికి మరణశిక్షలు విధించబడ్డాయి. పైవారిని చంపుతున్నప్పుడు తేన్‌గాల్ దగ్గరవున్నాడు. హత్య జరుగుతున్నప్పుడు తలలు తరిగి దగ్గరవున్న బావిలో దొర్లిస్తున్నప్పుడు చూచాడు. చంపబడ్డ 38 మందిలో ఒకడు పెన్‌షన్ పుచ్చుకున్న పోలీసు హెడ్‌కానిస్టేబిల్, తేన్‌గాలుకు విరోధి. అతని తలను సరిగ్గా నడిమికి బద్దలుకొట్టించాడు. తేన్‌గాల్ మెలాట్టూరులో పట్టుబడి 1922 జనవరి 20 వ తేదీన కాల్చివేయబడ్డాడు."

ప్రజాకంటకుడైన యెస్టేటు మేనేజరుకు వ్యతిరేకంగా మాప్లాలను నడిపిన ఖిలాఫత్ వుద్యమ కార్యదర్శి మహమ్మదున్నూ, మాప్లా రిబెలుడు పోలీసు సర్కిలినస్పెక్టరును వధించిన మహమ్మద్ హాజీయున్నూ, తన సొంతక్యాంపులోనున్న దోపిడీగాండ్రను శిక్షించిన సితీకోయాతంగాళున్నూ, శత్రు సైన్యానికి సహాయపడ్డందుకు 38 మందిని సంహరించిన చెంబ్రాసరీ తేన్‌గాళున్నూ ప్రజాపీడితుల నాశనంచేయటం, జీవితాశయంగా పెట్టుకొన్నారు. అట్టివీరిని మూఢమతావేశపరులైన మాప్లానాయకులనడం తప్పు.

కాని యిదంతా చెప్పడం తిరుగుబాటులో అసలు మతవైషమ్యము లేనేలేదనడంగాదు. అజ్ఞానులై వెనుకబడివున్న మాప్లాలలో తమ మతంలోకి నిర్బంధంగానైనా యితరులను మార్చాలనే మూఢులు కొంతమంది వుంటారంటే ఆశ్చర్యమేమీలేదు. కాని తిరుగుబాటుయొక్క ముఖ్యశక్తి మతమౌఢ్యం, మతోద్రేకం కాదని యెవరైనా స్పష్టంగా చెప్పవచ్చు.

## తిరుగుబాటుకు కారణమైన శక్తులు

1921లో వచ్చిన మలబారు విప్లవానికి మూలకారణాలేవో చూదాం. కొంతమంది మార్క్సిస్టుల మనుకొనేవారు కేవలం రైతుల అసంతృప్తే తిరుగుబాటుకు కారణం అంటారు. ఈ వుద్దేశాన్ని నేన్ను కాదనను. ఒక అర్ధ శతాబ్దంకిృందట లోగాన్‌గారు యే కారణాలైతే రైతుల అసంతృప్తికి అవకాశమిచ్చాయని వాృశారో, వేటినైతే పృభుత్వం లెక్కచేయకుండా వదిలేసిందో, ఆ వ్యవసాయక కష్టకారణాలు లేనట్లయితే రైతులు కాంగెృసు - ఖిలాఫత్ వుద్యమాలలో అంత గొప్పగా సంఘటితపడేవారు గారు. ఖిలాఫత్, కాంగెృసువుద్యమ నాయకులలో యెక్కువమంది కౌలుదారీ వుద్యమ నాయకులనేది జ్ఞాపకముంచుకోవాలి. మంజేరీలో జరిగిన అఖిల మలబారు రాజకీయ మహాసభలో యెక్కువ తీవృంగా ఆలోచించి, చర్చించి, తుదకు ప్యాసుచేయబడ్డ తీర్మానాలు అసహాయోద్యమాన్నీ, కౌలు సంస్కరణలనూ బలపరిచాయి. ఈ సమావేశం తరవాత దక్షిణ మలబారులో యేర్పడినన్ని కాంగెృసు కమిటీలు, ఖిలాఫతు కమిటీలూ సంఖ్యలో చూచుకుంటే 1938 - 40 లో గూడా యేర్పడలేదు.

కాంగ్రెసు, ఖిలాఫత్‌వుద్యమనాయకుల వుపన్యాసాలు రెండువైపులా పదునున్న కత్తివలె అటు బ్రిటిషుప్రభుత్వానికీ, యిటు జమీందార్లకూ వ్యతిరేకంగా వుండేవి. అణచబడ్డ మాప్లారైతుకు యీ వుద్యమమే ఒక క్రొత్త వెలుగునూ, ఆశనూ యిచ్చింది. ఈ పోరాటం ఒకరైతు రాజకీయ ప్రజా పోరాటానికి చక్కని వుదాహరణయని చెప్పవచ్చు.

సులభమయినవయినా కొన్ని ముఖ్యమైన ప్రశ్నలకు "మార్క్సిస్టులు" యీ సందర్భంలో జవాబుచెప్పవలసి వుంటుంది. మాప్లాలే పాృబల్యంగావున్న ప్రదేశంలోనే యీ పోరాటం యెందుకు రావలసి వచ్చింది? ఎర్నాడు, వల్లువనాడు, పొన్నానీ తాలూకాల్లో యెలా మాప్లాలు ప్రాబల్యంగా వున్నారో (జనసంఖ్యలో) అల్లానే ఇతర ప్రదేశాల్లో హిందువులు ప్రాబల్యంగా వున్నారు. ఇచ్చట ప్రభుత్వంగాని, లేక దానిచే సృష్టించబడ్డ జమీందారీ విధానంగానీ హిందువులకు అనుకూలంగా వుందనలేము. జమీందార్ల, ఆఫీసర్ల వత్తిడీ, దోపిడీ మాప్లాలకెంత బాధాకరమయిదో,

అంతే హిందువులకు కూడాను. మాప్లాతెగ ఒక్కటిగా తిరుగుబాటు లేవదీసినప్పుడు, "తిరుగుబాటు ప్రభుత్వ వ్యతిరేకంగానీ, లేక జమీందారీ వ్యతిరేకంగానీ కాదు; కేవలం హిందూ వ్యతిరేక పోరాటం" అనే ప్రచారానికి హిందువులెందుకు గురికావాల్సివచ్చింది? ఎందుకంటే, తిరుగుబాటుకు ముందుజరిగినప్రచారం, సమీకరణలలో హిందువులు చాలా వెనుకబడ్డారు. జరిగిన ఖిలాఫత్ సభలూ, సమావేశాల్లోగాని, చేర్పించిన సభ్యత్వంలోగానీ, పోల్చిచూస్తే మాప్లాలున్న ప్రదేశాల్లో సభలూ, సభ్యత్వం చాలా యెక్కువని తెలుస్తుంది. కొన్ని మతపరివర్తనాలుగూడ బలవంతంగా జరగడానికి కారణ మేమిటి?

ఇవి మార్క్సిస్టు చరిత్రకారులమనుకొనే ప్రతివారూ జవాబు చెప్పవలసిన ప్రశ్నలు. పై ప్రశ్నలకు జవాబు చెప్పటం యిచ్చట నాపనిగాదు. సమస్యను పూర్తిగా అర్థం చేసుకోవాలంటే నేను యిందులో వ్రాసిన దానికన్నా యింకా యెక్కువ పరిశోధన చేయవలసి వుంటుంది. కాని యీ సమస్యను గురించి నేనుచేసిన కొద్దిపాటి పరిశోధనలవల్ల తేలిన పర్యవసానాలు యిక్కడ పొందుపరుస్తాను.

(1) మొత్తంమీద హిందువులకన్నా మాప్లాలకే యెక్కువ నిర్మాణదృష్టి వుంది. వారి మతసాంప్రదాయాలు, ప్రార్థనలూ సమిష్టి భోజనాలు మొదలయినవీ, 'అంతా సమానమే' అనే సార్వజనికభావము యితర జాతులకన్నా వారికి యెక్కువ సమీకరణకు, నిర్మాణానికీ అవకాశమిచ్చాయి. అందువల్ల యెప్పుడైతే రాజకీయ నాయకులు పోరాటం కొరకు సంఘటితపడమని సందేశాన్నిచ్చారో వెంటనే యితర జాతులకన్నా మాప్లాజాతి శరవేగంతో ఆ సందేశాన్ని తీసుకొని పనిచేసింది.

(2) కాంగ్రెసు - ఖిలాఫత్ వుద్యమంలో కేంద్రీకరించబడవలసిన ఆవశ్యకత హిందువులకన్నా మాప్లాలకు ఎక్కువ వుంది. యెందువల్లనంటే, జాతీయ నాయకత్వం యిచ్చిన "టర్కీ కలీఫాను ముట్టుకోవద్దు" అనే నినాదం ప్రతియొక్క ముస్లాన్‌కు ప్రియతమమైంది. ఉద్యమం నిరంకుశత్వంనుండి స్వేచ్ఛకూ, జమీందార్లనుండి విముక్తికొరకు సాగుతున్నట్లు హిందువులకు కనపడితే, మాప్లాలకు యీ వుద్యమం ప్రాణతుల్యమయిన తమ మతోద్ధారణకొరకయిన పవిత్రయుద్ధంలా కనపడింది

పై కారణాలు యెక్కువ మాప్లాలున్న ప్రదేశంలోనే సమీకరణ యెందుకు జరిగిందో తెల్పుతాయి కాని తిరుగుబాటు స్వరూపాన్ని, దాని క్రమాన్ని పై కారణాలు తెలియచేయవు. ఇది కష్టమయిన ప్రశ్న.

(3) తిరుగుబాటు నడిచిన పంథా యావత్తూ తెలుసుకోవాలంటే కాంగ్రెసు - ఖిలాఫత్ కౌలుదారీ సమిష్టి వుద్యమం సమీకరించిన వివిధ సాంఘిక శక్తులను పరిశీలించాలి. ఈ సాంఘిక శక్తులను యీ క్రింది విధంగా విభజించవచ్చు.

(ఎ) కేంద్రనాయకత్వంలోని హిందువులు : వీరంతా కనామాదార్ల తెగనుండి వచ్చిన వకీళ్ళు, యితర రకాల విద్యావంతులు. వీరు జాతీయ బూర్జువా నాయకత్వంయొక్క ప్రతిబింబాలు. నిరంకుశత్వంపై వున్న యీర్ష్యా దానికి వ్యతిరేకంగా పోరాటం రావాలనే ఆతురతా, వారి పిలుపుకు ప్రజలిచ్చిన అద్భుతమైన ఆహ్వానానికి వుబ్బి తబ్బిబ్బులుకావటం, అహింస, సత్యం అనే సూత్రాలతో ప్రజలను హద్దులో వుంచగలమనే ధీమా, జమీందార్లపై వారికున్న కోపం మొదలయినవి వీరిని, ప్రజలను పోరాటంకొరకు సమీకరించేలా చేశాయి. ప్రజలు సత్యం - అహింసా సూత్రాలు దాటి తమంతట తాము సంఘటితపడ సిద్ధమయ్యేంతవరకూ వీరు ప్రజలతోనే వుండేవారు. కాని తర్వాత వీరు ప్రజల్ని వారివిధికృతానికి వదలేసి మెల్లగా తప్పుకున్నారు వీరు వరూంపటాందారుల కోర్కెలను అసలు లెక్కలోనికి తీసుకోనేలేదు.

(బి) ఇదే నాయకత్వంలోని మాప్లాలు : వీరు హిందూ నాయకులతో చాలా భేదిస్తారు. కాని ప్రజల్లో వీరికి గట్టిపునాదులు వుండేవి. వరూంపటా-దార్ల కొరకు వీరు గట్టిగా నిలబడ్డారు. అందువల్ల వీరిది చాలా అభివృద్ధికర నాయకత్వం. అహింసాయుత, అసహాయోద్యమ హద్దుల్లోనే ప్రజలను వుంచడానికి ప్రయత్నించినా, వీరు ప్రజలను వదలిపెట్టి వెళ్ళలేదు. వీరిలో ప్రముఖుడూ, యీనాటికిగూడా మాప్లాలచే వీరుడుగా యెంచబడుచున్న నాయకుడు మహమ్మద్ అబ్దుల్ రహిమానుగారు.

(సి) తిరుగుబాటు జరిగిన ప్రదేశంలోని ఛోటానాయకత్వం ముఖ్యంగా, ముసాలియర్లు, తేనేగాలులు, హాజీలూ ఇతర దైవభక్తులైన

మాప్లాలతో నిండివుండేది. మతావేశపరులైనా, తీవ్రమయిన సామ్రాజ్య వ్యతిరేకులు గావున, వీరి మతసంబంధ ప్రచారం చాలా పనిచేసింది. వారిలో కొంతమంది పేరుప్రతిష్టలకు, వీరకార్యాతురతకు పనిచేసి వుండవచ్చు. కాని బలమైన కేంద్రనాయకత్వం వుండివున్నట్లయితే వారు చక్కటి రైతువర్కర్లుగా తయారయి వుండేవారు. తిరుగుబాటు కాలంలోనూ, అంతకుముందున్నూ వారు ప్రదర్శించిన సమీకరణశక్తి చూచినట్లయితే వారిని పోగొట్టుకోవటం తీరని నష్టమని చెప్పాలి.

(డి) సామాన్యసభ్యులు: వీరిలో కొంతమంది సాంఘిక విదూరత, వ్యక్తిగత తత్వంగలవారు అయివుండవచ్చు. కాని యెక్కువమంది నిజమయిన జమీందారీ వ్యతిరేకులు గాన సహజంగా ప్రభుత్వ వ్యతిరేకులుగా వుండేవాడు.

(ఇ) హిందూ ఛోటానాయకత్వం, దాని సామాన్య సభ్యులు తమ పైనాయకత్వం యే ధోరణిలో వుందో అదే దోరణిలో వీరూ వుండిపోయారు. అందువల్ల యెప్పుడైతే విప్లవప్రారంభదశలో వీరు పోలీసు హడావుడీ, సైన్యం రాక చూచారో తక్షణం ప్రజలను వదిలేశారు.

ఆఖరిరోజుల్లో వుద్యమం యెందువల్ల కొంతవరకు మతానుకూలంగా మారవలసివచ్చిందో యిప్పుడు చెప్పటం కష్టంగాదు. తనతోటి హిందూసోదరుడు తనను విసర్జించాడనేది మాప్లా తెలుసుకున్నాడు. అదే సమయంలో సైన్యం తనను వేటాడి హింసించవచ్చింది. తనతోటి హిందూసోదరులు తనకు వ్యతిరేకంగా సైన్యానికి సహాయపడ్డారు. ఇది సహజంగా అతనిని రెచ్చగొట్టింది. ఈ పరిస్థితి తిరుగుబాటుదారుల్లో వుండిన మతమౌఢ్యుల ప్రాభావం కొందరిపైన బాగా పనిచేసింది. అందువల్ల మాప్లాలు యేవోకొన్ని పనులు హిందువులకు వ్యతిరేకంగా చేశారూ అంటే ఆశ్చర్యపడనవసరంలేదు ఇంత తక్కువగా హిందూ వ్యతిరేక కార్యాలు జరిగినందుకు విజానికి ఆశ్చర్యపడాలి.

ఈవిధంగా మలబారులో వచ్చిన మహావిప్లవం నిరుపయోగమైంది. విచారకరమైన బాటకు నెట్టివేయబడింది. ఎవరు దీన్ని తప్పుతోవ్రవల పట్టించారు? విచారకరమైన యీ అంతిమస్థాయికి యెవరు కారణం? అనేది 

నిజం తెలుసుకోవాలీ అనేది అడుగదగిన ప్రశ్న. అఖిల భారత కేంద్ర రాజకీయ నాయకత్వమూ, మలబారురాష్ట్ర రాజకీయ నాయకత్వమూ తాము లేవదీసిన ప్రజాశక్తుల స్వభావాన్ని గ్రహించకపోవడంవల్లనే ఈ మాప్లా తిరుగుబాటు పెడమార్గంబట్టి విఫలమైంది. ఏలాంటి అనుచరులయితే తమకు కావాలనుకున్నారో దానికి భిన్నంగా వారికి అనుచరులు లభించారు. అయినప్పటికి తమకు తగినవారని వారు తలచారు. ఇలాగే ప్రజలుకూడా తాము ఆశించిన నాయకత్వం లభించిందని తలచారు. కాని అది వారికి కేవలం భిన్నంగా పనిచేసింది. దక్షిణ మలబారు నాయకత్వం శక్తివంత మయిందిగాదనీ, ప్రజలు కేవలం గొర్రెలగుంపులా వుండగూడదనీ తెలుసుకొనుటకు, ఉన్న పౌరసత్వ హక్కులు పోగొట్టుకొని పది సంవత్సరాల భయంకరమైన రక్తప్లావిత పోరాటాన్ని దాటవలసివచ్చింది. ప్రజలకు తమ స్వంత ఆర్గనైజేషనువున్నా (సంఘం) నాయకత్వం భిన్నంగావున్న కారణంవల్ల వేలకొద్ది జీవితాలు బలికావటం, చెప్పరాని కష్టాలు భరించడం సంభవించింది.

# 2. నూతన రైతువుద్యమ ప్రారంభం

1930 లో ప్యాసయిన "మలబారు కౌలుదారీ చట్టం" (Malabar Tenancy Act) తో మలబారు రైతువుద్యమంలో ఒక దశ పూర్తి అయింది. 50 సంవత్సరాలుగా కనామాదార్లు ఆందోళన చేసున్న కోర్కెలు ఇంచుమించు సఫలమయ్యాయి. జమీందారు తన ఇష్టమొచ్చినప్పుడల్లా కనామాదారును భూమినుండి తరిమివేయడమనేది ఇక సాధ్యంకాదు. జమీందారు భూమిపై ఎంతలాభాన్ని పొందుతాడో అంత కనామాదారుకూడా పొందగలడు. డబ్బుగల పెద్దపెద్ద వ్యాపారస్తులు మొదలైనవారు కనామాదారు ఎక్కడున్నా వెతుక్కొచ్చి మరీఅతడిభూములను కొనేయడం వల్ల కనామాదారుదగ్గర డబ్బు పోగయ్యేది. జమీందారు ఇదివరకువలె శిస్తులు హెచ్చిండంగాని, ఇతర అక్రమ వసూళ్ళను చేయడంగాని జరుగదు. 12 సంవత్సరాలకొకసారి కౌలుతిరిగి వ్రాసేటప్పుడు చెల్లించుకోవలసిన సుంకము కనామాదారుకు బాధాకరంగా వుండేది. ఒక్కొక్కప్పుడు యీ సుంకాలు కట్టుకోలేక కుటుంబాలే నాశనమయ్యేవి. కాని యిప్పుడు అలా జరగడానికి వీలులేదు. జమీందారు తెలిసీ తెలియని చపల చిత్తంతో నిరంకుశంగా యిష్టమొచ్చినట్లు సుంకాన్ని హెచ్చించడంగాక, చట్టనిబంధనల ప్రకారం లెక్కించి సుంకం చెల్లించవచ్చు.

ఇలాంటిసంస్కరణలు సరిగా 10 సంవత్సరాలకు ముందే తిరువాన్కూరు, కొచ్చిన్‌సంస్థానాల్లో చేయబడ్డాయి. అక్కడ ఎప్పుడో సాంఘికంగా, ఆర్థికంగా కనామాదారు జమీందారుపై ఆధారపడ నవసరంలేకుండా స్వతంత్రుడైనాడు. పూర్వంనుండీ కనామాదారుపై చలాయిస్తున్న నిరంకుశహక్కులన్నిటినీ జమీందారు వదులుకోవలసివచ్చింది. జమీందారు ఇప్పుడు కేవలం లా ప్రకారం నిర్ణయించిన శిస్తునుమాత్రమే వసూలు చేసుకొనే వసూలుదారయ్యాడు. ఇతర సాంఘికాభివృద్ధికొరకు చేయబడ్డ మరుమ్మక్కతాయం, నంబూద్రి చట్టాల్లోవలె కౌలుదారీ సంస్కరణల్లోకూడా భూసామ్యసంస్థాలైన తిరువాన్కూరు. కొచ్చిన్‌లు మద్రాసురాష్ట్రంలోని బూర్జువాప్రభుత్వవిధానం

కన్నా రెండడుగులు ముందుకొచ్చాయి. భూసామ్యవిధాన నిరంకుశపద్ధతిపైన సాముదాయక కుటుంబ నిరంకుశఅధికారములపైన కూడా ఈ భూస్వామ్య సంస్థానాలే మొట్టమొదట దెబ్బకొట్టాయి. కాని బ్రిటిషు మలబారు యెప్పుడైతే ఒకమాటు సాంఘిక సంస్కరణకు తలపడిందో, అప్పటినుండి సంస్థానాలకన్నా ముందునడిచిందనిచెప్పాలి. ఉదాహరణకు, మద్రాసుమరుమ్మక్కత్తాయంచట్టం,కొచ్చిన్,తిరువాన్కూరుల నాయరురెగ్యులేషన్సుకన్న విశాలమైంది. అన్ని తెగలకు సమానంగా వర్తించింది. తిరువాన్కూరు, కొచ్చిన్ సంస్థానాల్లోని నంబూద్రి చట్టం కుటుంబములోని సభ్యుల భరణపు హక్కులకు కొన్ని హద్దులు పెట్టింది. కాని మద్రాసు చట్టం పూర్తిగా విడిబడిపోయే హక్కుకూడా యిచ్చింది. ఇంకా గొప్పవిషయ మేమిటంటే, యీ చట్టం సమాజంలో స్త్రీలకు ఆస్థిహక్కుల్లో పురుషులతోటి సరిసమాన హక్కులు యిచ్చింది. అంతేగాదు, యిష్టమొచ్చినంత ఎక్కువ మందిని వివాహమాడ వీలులేకుండా చేయబడింది.

ఇలాగే కౌలుదారు చట్టంలోగూడా, కొచ్చిన్, తిరువాన్కూరు సంస్థానాల్లో జమీందారుపై ఆధారపడకుండా చేయబడింది. కేవలం కనామాదారుకేగాని, ఆచట్టంలో వరూంపటామాదారుకు స్థానంలేదు. కాని మద్రాసు చట్టం వరూంపటామాదారు సిస్తు, కౌలువిషయాల్లో ఒక నిర్ణయాన్నిచ్చింది. వరూం పటామాదారే కాకుండా, యెవరైతే కౌలుమీద ఆధారపడి వుంటారో వారందరికీ యీ నిర్ణయం అన్వయిస్తుంది. ఇంకోవిధంగా చెప్పాలంటే, న్యాయమయిన శిస్తు అంటే, జమీందారుగాని, కనామాదారుగాని, వ్యవసాయంచేయని వరూంపటాందారుగాని, మరియేయితర కౌలుదారుగాని నేరుగా వ్యవసాయంచేసే కౌలుదారు వద్దనుండి పొందవలసిన నిర్ణీతమైన మొత్తం అని అర్థం. కౌలు ఎన్నిసంత్సరాలైనప్పటికీ, భూస్వాములచేత నిరంకుశంగా కౌలుదారుడు భూమినుండి వెళ్ళగొట్టబడగూడదు.

ఏవోకొన్ని కారణాలు లెక్కకురానివి వున్నా, భూసామ్య విధానపు సంస్థానాలమధ్యా, బూర్జువాపరిపాలనమధ్యా వున్నభేదం అంత నిష్కారణమైందికాదు. తిరువాన్కూరు, కొచ్చిన్ సంస్థానాలో భూసామ్య పద్ధతిపైనా, శిధిలావస్థలోనున్న కుటుంబ పద్ధతిపైనా విసరినదెబ్బ బూర్జువా

స్వరూపం దాల్చుతూవుండిన రాచరిక పాలకులచే పైనుండి విసరబడింది. కాని మలబారులో యిదేదెబ్బ అప్పుడప్పుడే అభివృద్ధి అవుతూవున్న బూర్జువా ప్రజాశక్తిచే క్రిందినుండి క్షీణగతిలోబడి అంతకంతకూ వూగిపోతున్న భూసామ్య శిధిలాలపై ఆధారపడ్డ బూర్జువా ప్రభుత్వంపై విసరబడింది. 1930లో వచ్చిన మద్రాసు చట్టం ఆనాటి గవర్నరు పెట్టిన అనేక ఆటంకాలు దాటవలసివచ్చింది. గవర్నరు జమీందార్లను బలపరచాడు. కాని కొచ్చిన్, తిరువాన్కూర్లలో చట్టం పూర్తిగాకముందునుండి గూడా మహారాజాలు బిల్లును బలపరచారని చెప్పబడుతుంది. అందువల్ల సంస్థానాల్లో చట్టం త్వరగా చేయబడింది. కాని యీచట్టం చేయడంద్వారా విసరినదెబ్బ భూసామ్య వ్యతిరేకతను నాశనం చేసిందేగాని, భూస్వామ్య విధానాన్ని పూర్తిగా నాశనంచేయలేదు. బూర్జువా స్వరూపం పొందుతున్న సంస్థానాలకు భూమిని సులభంగా అన్యాక్రాంతం చేయడానికి వీలుగా చట్టాలు చేయడం ఆర్థికంగా, రాజకీయంగా అనివార్య మయింది. కాని అంతమాత్రంచేత యిది రైతులను జమీందారు పిడికిలినుండిగాని, లేక సంస్థాన ప్రభుత్వ పిడికిలినుండిగాని వదల్చలేదు.

అట్లని, బ్రిటిషు మలబారులో వరూం పటామాదారు జమీందారు యొక్క, మధ్యవర్తులయొక్క పిడికిళ్ళనుండి విముక్తి అయ్యాడని అనుకోవడం పొరపాటు. అదేమీ లేదు. ఆ చట్టంక్రింద యితడికి నిర్ణయించబడ్డ కౌలుగానీ, శిస్తుగాని ఆచరణలో భ్రమతప్ప యింకేమీగాదు. యెందుకంటే ప్రతిసంవత్సరం ఒక సంవత్సరపు సిస్తు డబ్బురూపంలో పూచీకత్తుగా కట్టాలి. అలా జరగనప్పుడు, అతడు భూమినుండి తరిమివేయబడటానికి చట్టరీత్యా న్యాయమైన కారణాలు దొరుకుతాయి. దీని అర్ధమేమిటి? యేరోజునయినా భూస్వామి 100కి 95 మంది రైతులను భూమినుండి తరుమవచ్చు. అంతేగాదు; భూస్వామి, రైతు ముందుగానే పూచీమొత్తం చెల్లించినాసరే, యెప్పుడైతే భూస్వామి తన సొంతసాగుకు భూమికావాలంటాడో అప్పుడు చట్టం ప్రకారం కౌలుదారు భూమినుండి నిష్క్రమించవలసి వుంటుంది. ఒక్క కనామాదారీ వర్గానికి తప్ప యితర కౌలుదారీ వర్గాల కన్నిటికీ యీకారణాలు బాధాకరంగా వర్తిస్తాయి. కాని, యీ పరిస్థితి యీ కౌలుదారీ వర్గంలోనూ, వరూంపటామాదార్లలోనూ ధనిక

బీద భేదాన్నిబట్టి యేర్పడ్డది. ధనికవర్గం చట్టసమ్మతంగానూ, న్యాయము గానూ తనకు వచ్చిన హక్కులను అనుభవించ గలదు. కాని, బీదలు అనుభవించలేరు. బూర్జువా ప్రజా స్వామ్యంలో స్వామాన్య ప్రజలు యెంతగా పౌరసత్వపు హక్కులు అనుభవిస్తారో అంతే యీ బీదవర్గం ఆ చట్టాల సౌకర్యం అనుభవిస్తారు. మలబారు భావిచరిత్రకు యీ భేదం చాలా ప్రాముఖ్యమయింది. యెందుకంటే, వ్యవసాయ దారులైన వరూంపటామాదరీ వర్గానికి వ్యతిరేకంగా యీ భేదమే ధనిక తెగలునూ, వ్యవసాయకులు కానివారునూ అయిన కనామాదార్లు మొదలయిన వారిని యేకం చేస్తుంది. ఈ ముఠాల కలయికయే తర్వాత కిసాన్‌సభా వుద్యమానికి వ్యతిరేకంగా పోరాడ తలపడింది.

ఇలా 1930 లో వచ్చిన చట్టంతో కనామాదార్ల జమీందారీ వ్యతిరేక పోరాటం అంతంకావటం జరిగింది. కనామాదారు జమీందార్లతో కలిసి వరూంపటామాదారుకు వ్యతిరేకంగా నిలబడి పోరాడ సంసిద్ధమయ్యే నూతనదశ ప్రారంభమైంది.

అంతేగాదు. ఈదశజమీందారు సాంఘికప్రాబల్యంకొరకు తన రైతులపై సాగిస్తూండిన పోరాటంకూడా అంతమై, రైతులపై తన ఆర్థిక ప్రాబల్యాన్ని సుస్థిరం చేసుకొనుటకు పోరాడే నూతనదశ ప్రారంభమవుతుంది. సాంఘిక వ్యవస్థలో అగ్రగణ్యుడననీ, రైతుల సహజనాయకుడననీ జమీందారు వాదించే రోజులు గడిచిపోయాయి. తనకు చట్టసమ్మతంగా రావలసిన కౌలు, శిస్తు వసూలుచేసుకోవడమే జమీందారు కోరేది. 1928 లో "రాఘవయ్య కమిటీ" ముందు ఒక జమీందారు సాక్ష్యంలో "తల శుభ్రంగా క్షవరం చేయించుకోకుండా కేవలం గడ్డంమాత్రమే చేసికెళ్ళితే, రైతు భూమినుండి వెళ్ళగొట్టబడడమేగాక, కాల్చి చంపివేయబడతాడు గూడా" అని చెప్పాడు. ఇప్పుడు జమీందార్లు అలా అనలేరు. 1939 లో టెనెన్సీ విచారణకమిటీ ముందు జమీందార్లు ఒకరితర్వాత ఒకరు అంతా యిచ్చిన సాక్ష్యాల్లోని సారాంశాన్ని చూస్తే యిది బోధపడుతుంది. "యే చట్టం వచ్చినా మాకు లెక్కలేదు. మాకు కావలసింది మాకు రావలసిన శిస్తులు, కౌలు మాత్రమేన"న్నారు. ఇంకోవిధంగా చెప్పాలీ

అంటే, జమీందారు జమీందారుగా తన సాంఘిక హోదా పోయినా సమాధానపడి, బూర్జువాస్వరూపాన్ని పొందుతున్నాడు అని చెప్పాలి.

ఈ విధంగా యిది భూస్వామ్య జమీందారీ పద్ధతియొక్క అంతిమ దశ, శిస్తు వసూలు చేసుకునే బూర్జువావర్గంయొక్క ప్రారంభ దశ అని చెప్పవచ్చు. అంతేగాకుండా వరూంపటామాదారు కేవలం కనామాదారుకు సహచరుడుగా వుంటూవుండిన స్థితికి ఆఖరిదశా, వరూంపటామాదారు తన స్వంతశక్తిపై ఆధారపడి పోరాడడమో లేనిచో మునుపటివలె దౌర్భాగ్య స్థితితో మ్రగ్గడమో తేల్చుకునే పోరాటానికి ప్రారంభదశ కూడాను. ఇదివరకటి పద్ధతిలో విముక్తి ఆవుతానని వరూంపటామాదారు ఇక ఆశిం లేడు. బూర్జువా నాయకత్వంక్రింద విముక్తి కావచ్చనే ఆశకు యిక స్వస్తి చెప్పాల్సిందే. ఇక అతడు తన విముక్తికి నూతన పద్ధతిల్లో నూతన నాయకత్వం క్రింద సంఘటితపడాలి.

## నూతన నాయకత్వం పుట్టుక

ఆధునిక నాయకత్వం తలయెత్తడానికి యెంతోకాలం పట్టలేదు. 1930–32 కాంగ్రెసు వుద్యమాలు ఒక కొత్తరకమైన కాంగ్రెసుకాడర్లను వుత్పత్తిచేశాయి. ఈ కేడర్లే తుదకు ఆధునిక రైతువుద్యమానికి నాయకత్వం వహించాయి.

మలబారులోని కాంగ్రెసు వాలంటీర్లు సాంఘికంగా, ముఖ్యంగా పల్లెటూరి మధ్యతరగతికి చెందినవారు. అనగా, కొద్దిమంది అభివృద్ధికర జమీందార్లు, బూర్జువాలూ వర్గచైతన్యం లేకపోయినా, జాతీయ చైతన్యం కలిగివున్న కొంతమంది వర్కర్లువున్నా, సత్యాగ్రహుల్లో యెక్కువమంది కౌలుదారీ వ్యవసాయంతో దగ్గిరసంబంధ మున్నవారు. కాని వీరంతా వారి కుటుంబాల్లో పెత్తనదార్లు కాదు. నిరుద్యోగులుగానో, యేదో కొద్దిగా చదువుకొన్న బడిపంతులు వుద్యోగాల్లోనో వుండేవారు. వీరు స్వయంగా వ్యవసాయకులు కాకపోయినా, పూర్తిగా వ్యవసాయంతో సంబంధం వుండేది. వీరు రైతుల మానసికతత్వాన్ని, బాధలను, సమస్యలను అర్థం చేసుకొన్నవారు. కాని సామాన్య రైతుకన్నా పైస్థాయిలో

వున్నారు గాన. వారు రైతుసమస్యలకన్నా జాతీయసమస్యలపై యెక్కువ ఆలోచించారు.

బయట జాతీయపోరాటంయొక్క నడకతీరూ, జైల్లో ఈ జాతీయ పోరాటాన్ని గురించి తీవ్రమైన చర్చలూ, రాజకీయసమస్యలపై వారుచేసిన గాఢమైన పరిశోధనా, జైల్లోవున్న విప్లవవాదులతో కలిగిన దగ్గర సంబంధం మొదలయినవి యెక్కువమంది సత్యాగ్రహులను వారి విడుదలనాటికి స్వచ్ఛమైన విప్లవవాదులుగా మార్చాయి. భారతదేశంలో నలుమూలలా యిలాంటి మార్పే వచ్చింది. అందువల్ల ఈ విషయంపై యెక్కువ యిచ్చట చర్చించడం అనవసరం. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ స్థాపనకు యీ మార్పే అవకాశమిచ్చిందని చెప్పితే చాలు. ఇంచుమించు సత్యాగ్రహ వర్కర్లంతా కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో చేరి తీవ్రంగా పనిచేయసాగారు. వీరికి సంఘంలోగల అంతస్థే వీరిని తప్పనిసరిగా రైతువుద్యమం వైపు తమ దృష్టిని కేంద్రీకరించేలా చేసింది.

ఈ ఆధునిక నాయకత్వపు స్వరూపమే రైతువుద్యమం యెచ్చట రావాలి, యెచ్చట పెరగాలనేది నిర్ణయించింది. 1930-32 లోని కాంగ్రెసు వుద్యమాలు ఉత్తర మలబారులో చాలా ప్రాబల్యంగా వున్నాయి. దక్షిణ మలబారంటే కాంగ్రెసు నాయకత్వం బెదిరేది. మరల ఇంకొకమాటు యెక్కడ 1921 వ సంవత్సరంలో వచ్చినలాంటి తిరుగుబాటు వస్తుందోనని వర్ణించ శక్యంగాని కంగారు పడేవారు. అందువల్ల దక్షిణ మలబారును సత్యాగ్రహ ప్రదేశాన్నుండి మినహాయించి, అచ్చట సత్యాగ్రహులను కాలికట్టుకో లేక యేదయినా అటువంటి రక్షణకేంద్రాలకోవెళ్ళిపనిచేయమనీ, తుదకు వారి గ్రామాల్లోకూడా సత్యాగ్రహం చేయవద్దనీ, వుత్తరువులు జారీచేశారు కాంగ్రెసు నాయకులు. కాని వుత్తర మలబారులో యిలా గాదు. శ్రీ రేలప్పన్‌గారి "పయ్యనీరు యాత్ర" ఉత్తర మలబారును ఉత్తేజపరచింది. పయ్యనీరు ఉప్పు సత్యాగ్రహం, హోసదుర్గ్ తాలూకా అటవీ సత్యాగ్రహం, కన్ననూరు యువజన మహాసభ మొదలయిన ఘటనలు ఆనాటికి నిజమైన సత్యాగ్రహులుగా జైల్లోవున్న 1000 కే గాక, వేలమంది యువకులకు ఒక నూతన ఆవేశాన్నిచ్చి ఉత్తర మలబారును కదల్చివేశాయి. నూతనంగా ప్రారంభమైన రైతువుద్యమానికి యీ పరి

స్థితులు పునాదిని వేశాయి. జైలునుండి విడుదల అవుతున్న ప్రతి సత్యాగ్రహీ తన గ్రామంలోనే వుండిపోయాడు. తన గ్రామంలో పుస్తకాలయం, పత్రికా పఠనం, రాజకీయ చర్చలు మొదలైనవి సాగించ ప్రారంభించాడు. అంతేగాక, తన జైలు అనుభవం, జైల్లో యేమినేర్చుకొన్నదీ, యెవరిని కలిసిందీ, యేమి మాట్లాడిందీ, యేమిచేయ నిర్ణయించుకొన్నదీ. కూడా అతడు తన గ్రామస్తులకు చెప్పేవాడు. ఈ పఠనాలయాలే క్రమేపీ రాజకీయ చర్చలకు కేంద్రాలయ్యాయి. కొన్ని పఠనాలయాలు, కొంత మంది సత్యాగ్రహులు పనిచెయ్యకుండా మానివేసినా, కొత్త పఠనాలయాలు తలయెత్తడం, వున్నవి బలపడడం జరిగింది. ఈ పఠనాలయోద్యమమునుండే యీనాటి ప్రసిద్ధ రైతునాయకులు వచ్చారు. ఎప్పుడూ యేదో ఆందోళనచేస్తూండే కామ్రేడ్ కె. పి. ఆర్. గోపాలన్ రంగంమీదికిరావడం, శ్రీహర్ష పఠనాలయం స్థాపించడం జరిగింది. కాల్లీ శెరీయూత్‌లీగ్‌స్థాపించి, ఫుట్‌బాలు మొదలైనఆటలు నడుపుతుండేవాడు. ఇదేసమయానఇంకో మూల పూజ్యనీయుడైన భారతీయన్ తన భగవద్‌గీతా, భారతాల పారాయణాల ద్వారా తన ఆశ్రమానికి రైతులను ఆకర్షించి, రైతులహక్కులు సాధించవలసిన ఆవశ్యకత రుజువుచేస్తూండేవారు. ఇంకోప్రదేశంలో శ్రీ ఏ. వి. కున్‌హంబూ బలమైన యువజన సంఘాలు స్థాపిస్తూవుండేవాడు. ఉత్తర మలబారులో అన్ని ప్రదేశాల్లోను యువకులు ఆర్గనైజర్లుగా తమ శక్తిని ప్రదర్శిస్తూ భావి నూతన రైతువుద్యమ నాయకత్వం వహించబోతున్నామనే విషయం రుజువుచేశారు.

కాని దక్షిణ మలబారులో ఇదంతా ఏమీలేదు. ఉత్తర మలబారులో వున్నంతమంది శక్తివంతమైన సత్యాగ్రహులు దక్షిణ మలబారులోకూడా వుండేవారు ఐతే దక్షిణమలబారుకన్నా ఉత్తర మలబారులో యెక్కువ మంది సత్యాగ్రహులు వుండడమేగాక వుద్యమం ఎడతెగకుండా సాగింది. గావున, జైలుకెళ్ళిన ప్రతి ఒక్క సత్యాగ్రహికి పదిమంది కొత్త సత్యాగ్రహులు తయారు అయినారు. పోరాట స్వభావాన్నిబట్టి దక్షిణాన యిలా జరగలేదు. దీని ఫలితం యేమిటంటె, ఉత్తర మలబారులో సత్యాగ్రహులు తమ గ్రామాల్లోని ప్రజలను సమీకరిస్తూ ప్రజా వుద్యమాలకు పునాదిని వేస్తే, దక్షిణ మలబారువారు ప్రజలను నిర్లక్ష్యంచేసి, తాలూకా నాయకులు

గానో, మొత్తం మలబారు నాయకులుగానో పునాదిలేకుండా తయారయ్యారు. దీనిఫలితంగానూ. యితర కారణాలవల్లకూడా 1934 - 36 లో వుద్యమం ఆందోళనాదశలో వున్నప్పుడు దక్షిణ తాలూకాలైన పొన్నానీ, వల్లువనాడులు ఉత్తర తాలూకాలైన చరకాల్. కొత్తాయంలతో సరిసమానంగా వున్నప్పటికి నిజమైన సమీకరణ, పోరాటదశ (1937 - 42) వచ్చేటప్పటికి దక్షిణ మలబారు చాలా వెనుకపడిపోయింది.

## ఆర్థిక సంక్షోభం

కనామాదార్ల పోరాటదశ సమాప్తంగావడం, నూతన రైతువుద్యమ నాయకత్వం వికసిస్తూండడం, ఆర్థిక సంక్షోభం ప్రవేశించడం, ఒకేసారి జరిగాయి. కేరళ రాష్ట్రం (మలబారు) యొక్క ముఖ్యమైన ధాన్యాలు, వడ్లు, కొబ్బెర, మిరియం మొదలగు వాటిధరలు ఆర్థిక దుస్థితికి ముందు వున్న ధరలకు సగానికి సగంపడిపోయాయి. రైతు చెల్లించుకోవలసిన ముడుపులు, పన్నులు, అప్పులు, బండిబాడుగలూ మొదలైనవి రెండింతలయ్యాయి.

ఈ పరిస్థితి భూమిపై ఆధారపడే పై తరగతి రైతులను సహితం ఏదోరకమైన ఆందోళన, సమీకరణలలోకి లాగింది. వీరు యిలా ధరలు పడిపోవడానికి కారణం బర్మానుండి వస్తూండిన బియ్యం, సిలోన్ నుండి వస్తూండిన కొబ్బెర కారణమనీ, అందువల్ల ఆ దిగుమతుల నాపడానికి, వ్యవసాయాన్ని రక్షించడానికి, దిగుమతి సుంకాలు అధికంగా వెయ్యాలని ఆందోళనచేశారు. కాని వీరు మిరియం ధర పడిపోవడానికి కారణమేదో, ప్రతి సంవత్సరం మలబారులో వుత్పత్తి అయ్యే ధాన్యం 1 కోటి మంది మలబారు ప్రజలకు 6 నెలలకుకూడ రాదుగదా, ప్రజలెలా బ్రతుకుతారా అని గూడా వీరు ఆలోచించలేదు.

మలబారులో వచ్చిన యీ ఆర్థికదురవస్థ ఫలితంగా ఆ దశలో నాలుగు రకాల స్పష్టమైన ఆందోళనా, సంఘటన ప్రయత్నాలు గోచరమయ్యాయి.

(1) తిరువాన్కూరు హైకోర్టుజడ్జిగాపనిచేసి పింఛను పుచ్చుకున్న చాన్‌గానాశరీ పరమేశ్వరన్ పిళ్ళెగారిచే నడిపించబడ్డ "కొబ్బెర వుత్పత్తి

దార్ల సంఘం "(Cocoanut growers Association) ఒకటుండేది. దీని కోర్కెలన్నీ కొబ్బెరధర పెంచమని ఆందోళనచేయడంలోనే కేంద్రీకరించబడ్డాయి. ఈ సంఘానికి బ్రిటిషు మలబారు, తిరువాన్కూర్లలో కూడా సంబంధాలుండేవి. అచ్చటకూడా యిలాంటి సంఘాలను స్థాపించడానికి ప్రయత్నించారు. కాని యీ సంఘం యెక్కువమంది ప్రజలను ఆకర్షించే ప్రజాసంఘంగా అభివృద్ధికాలేదు. ఇదే పద్ధతులపై, యింత పెద్దసంస్థలు గాకపోయినా, కొచ్చిన్ సంస్థానం, బ్రిటిషు మలబార్లలో కూడా ధాన్యం వుత్పత్తిదార్లు, పోకచెక్క వుత్పత్తివార్లు సంఘాలు పెట్టుకున్నారు. కాని ఈ రెండుసంఘాల్లో గూడా, వుత్పత్తిదార్లంటే, కేవలం భూస్వాములూ, కంట్రాక్టుచేస్తున్న వ్యాపారస్తులూ, వుత్పత్తిదార్లుగా భావించబడ్డారు. అందువల్ల కొబ్బెరవుత్పత్తిదార్ల సంఘానికున్న ప్రజాసానుభూతిగూడా వీటికి లేకపోయింది. దీనికి కారణం యిది : కొబ్బెరధర ప్రతివారికి సంబంధించింది. యెందువల్లనంటే, ప్రతి బీదరైతు కొబ్బెర అమ్ముకొని, తన నిత్య అవసరాలకు కావలసినసరుకులను కొంటాడు. ధాన్యం అధికంగా నిల్వచేయటం, లేక ధాన్యం అమ్మటం అనేది యెక్కువ భూములుండిన భూస్వాములు, ధనిక కౌలుదారులకు సంబంధించినది మాత్రమే. (4)

(2) బ్రిటిషు మలబారులో వచ్చిన భూమిశిస్తు సంస్కరణను గురించిన ఆందోళనకు యిదేరకమైన స్వభావం వుండినా, యీ ఆందోళనా పద్ధతుల్లో భేదమువుంది. ఇది జన్మీలు, ధనిక కనామాదార్లు ప్రారంభించారు. ఈ ఉద్యమం రీసెటిల్మెంటు రేట్లకు వ్యతిరేకంగా వచ్చింది. ధరలు పడిపోవడంవల్ల, శిస్తులోవచ్చిన హెచ్చింపు $18\frac{3}{4}\%$ అధికపన్నులు చెల్లించుకోవలసిన సామాన్యరైతులకేగాక ధనికవర్గాలకు కూడా భరించరానిదైంది.

ఈ ఆందోళనాక్రమం తమాషాగా వుంటుంది. ఈ ఆందోళన ఆనాటి జిల్లాబోర్డు అధ్యక్షులైన ఆర్. యం పాలట్గారిచే నడుపబడింది. ఈయన మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీలో జమీందార్ల తరపున ప్రతినిధి. ఈ ఆందోళనద్వారా జమీందార్ల కోర్కెలకు విశాలాందోళన యివ్వడమేగాక రానున్న యెన్నికలలో కాంగ్రెసుకు వ్యతిరేకంగా పోటీచేయడానికి పునాదులు వేయడానికిగూడా ప్రయత్నించాడు. కాని 1933లో జైలునుండి 2:

బయటపడ్డ గాంధీతత్వ కాంగ్రెసువాదులు యీ సమస్యను తీసుకొని, దీనికి ప్రజావుద్యమ స్వరూపం యిచ్చి పాలట్‌గారి ఆటను గట్టించారు. కాంగ్రెసు సోషలిస్టులు యీ వుద్యమంలో కాంగ్రెసువారుగా పనిచేసి గొప్ప అనుభవాన్ని సాధించారు. ప్రజాందోళనా, ప్రజాసమీకరణానుభవాలతో వుద్యమాన్ని అన్నిరకాల రైతులను ఆకర్షించే వుద్యమంగా మార్చి, రైతుల యితర కోర్కెలు కూడా వుద్యమాశయాల్లో ప్రతిబింబించేలా చేశారు. (ఉ : ఋణాలూ, శిస్తులూ మొదలైనవి.)

(3) మూడోసారి తిరిగి తిరువాన్కూరులోనే జరిగింది. దీని నాయకత్వం సంస్కరణ బూర్జువానాయకత్వం. (క్రిష్టియన్ - మతస్థులు) దీనియొక్క ముఖ్య ఆశయం రుణనివారణకొరకు మాత్రమే. ఈ వుద్యమం కేవలం ఒక్క కుట్టునాడులో కేంద్రీకరించబడింది. కుట్టునాడు అల్లెప్పీకి దగ్గరగావుంది. 1938 లో కుట్టునాడు ప్రజాస్వామ్య సంస్కరణలకై రైతులు సాగించిన వీరోచిత పోరాటానికి ప్రసిద్ధి వహించింది. తిరిగి యీ మధ్య వ్యవసాయకూలీలు ఇక్కడే పోరాటం సాగించి జయించారు.

(4) అన్నిటికన్నా విశాలమైన, ప్రాముఖ్యమైన పోరాటం క్రాంగనూరు రైతు-కూలీ పోరాటం (క్రాంగనూరు కొచ్చిన్‌సంస్థానంలో వుంది. రైతు కూలీ అనే పదానికి, మలయాళంలో — కర్షక - తొహిలాళి అని అంటారు.) ఈ వుద్యమం కె యం. ఇబ్రాహీం, ఎం.ఎల్.సి. (కొచ్చిన్) గారిచే ప్రారంభించబడింది. మొదట రుణనివారణ కొరకు ప్రారంభమయినా, మలబారులో మొట్టమొదటిసారి వచ్చిన భూస్వామ్య, ధనికవాద వ్యతిరేక వుద్యమం యిది. రుణనివారణ విషయంమీదే తీవ్రంగా దృష్టినంతా కేంద్రీకరించినా, ఈ వుద్యమ నినాదాలు యించుమించు సోషలిస్టు నినాదాలను పోలివుండేవి. వుద్యమం యెక్కువమందిని ఆకర్షించి సహాయ నిరాకరణవుద్యమంగా మారింది. ఎలాగైతేనేం యెంత త్వరగా వుద్యమం పెరిగిందో అంత త్వరగా పతనమైపోయింది. ఏ ఒకరిద్దరు వ్యక్తులపైననో మితిమీరిన నమ్మకాన్ని వుంచడం, ఆందోళనా పద్ధతుల్లో మితిమీరిన డాంబికపద్ధతులు అనుసరించడం, నిర్మాణాత్మక పద్ధతులు తక్కువవడం, అందరూ అర్థంచేసుకొని అనుసరించగల్గే కార్యక్రమం బహుకొద్దిగా

వుండడం మొదలైనవి వుద్యమాన్ని అతిశీఘ్రంగా పతనానికి తీసుక వచ్చాయి. ఆ రోజుల్లో కాంగ్రెసు సోషలిస్టులకు ఆదర్శ వుద్యమంగా కనపడ్డ యీ వుద్యమాన్ని నడిపిన నాయకులుగాని, వర్కర్లుగాని (ఏ ఒక రిద్దరో తప్ప) యీనాటి యే ప్రజావుద్యమంలోనూ లేరు. ఆనాడు కాంగ్రెసు సోషలిస్టులకు చాలా దగ్గరగావున్న ఇబ్రహీంగారు తర్వాత గాంధీవాది కావడం, యీనాడు ముస్లింలీగరు కావడం సంభవించింది.

## రైతుకోర్కెలకు కాంగ్రెసు స్వరూపం యిచ్చింది

మనము యిదివరకే తెలుసుకొన్నట్లు కాంగ్రెసువారు భూమిశిస్తు సంస్కరణా వుద్యమానికి ప్రజావుద్యమ స్వరూపం యివ్వడానికి ప్రయత్నించారు. ఆనాడు హెచ్చుచేయబడ్డ భూమిశిస్తును తగ్గించమనేదానిపైనే గాకుండా, అసలు భూమిశిస్తు సెటిల్‌మెంటుకు ముందున్న శిస్తురేట్లలో బాగా తగ్గుదల కావాలని ఆందోళన, సభలూ, సమావేశాలు, వుత్సవాలు, దండులు మొదలయిన ప్రజాసంరంభం అన్ని తాలూకాల్లోనూ జరిగింది.

ఈ వుద్యమంలో కాంగ్రెసు సోషలిస్టులు ఎక్కువమంది పాల్గొనడమే గాకుండా, యెడతెగని కృషి తీవ్రంగా చేశారు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనడంవల్ల వచ్చిన కష్టాలనుండి బయటపడి పుంజుకోడంతో సరిపోయింది కాంగ్రెసు ముసలి నాయకులపని. రివిన్యూ మహాసభలు పెట్టినప్పుడు మాత్రం వస్తూండేవారు. యీ వుద్యమాన్ని ప్రజానీకానికి అందరికీ సంబంధించిందిగాచేసి, ప్రజావుద్యమ స్వరూపం యిచ్చింది. గ్రామగ్రామాన యెడతెగకుండా తిరిగి పనిచేసిన యువక కాంగ్రెసు సోషలిస్టులు, యువజన సంఘాలద్వారా, పఠనాలయాలద్వారా యువకులే యీ వుద్యమ నినాదాలను ప్రజలకందించారు.

ఈ ఆందోళన వారికి అనేక పాఠాలను నేర్పింది. ఈ వుద్యమం యువకులలో రైతుసమస్యలను అర్థంచేసుకొని, వారి నిజమైన బాధలను గుర్తించి వారిలో పనిచేయగల్గేంత దగ్గర సంబంధం తెచ్చింది. యీ ప్రజావుద్యమ అనుభవరంగంనుండే భావిరైతు వుద్యమ నాయకులైన, కామ్రేడ్ కేరళీయన్, భారతీయ్యన్, కె. పి. ఆర్. గోపాలన్, ఎ. వి. కున్హాంబూ లాంటివారు వుద్భవించారు. అప్పులు, జమీ శిస్తులవలె యీ

రీశెటిల్‌మెంటును బాధాకరంగా రైతులు భావించడంలేదనేది వారు గ్రహించారు. ఈ అనుభవమే మలబారు రైతుసంఘ కోర్కెలను తిరిగి సవరించవలసిన అవశ్యకతను కలిగించింది. భూమిసిస్తు రీశెటిల్‌మెంటును గురించి కోరుతున్న కోర్కె రైతుల యితర డిమాండ్సుతోపాటు ఒకటి మాత్రమే. భూమిశిస్తు తగ్గింపుకొరకు రైతులు యిస్తున్న సూచనల స్వరూపమే మారిపోయింది. ఇప్పుడు బీదరైతులను మినహాయించి పైతరగతి రైతులకు భూమి ఎక్కువైనకొద్దీ శిస్తురేట్లు హెచ్చించాలి. (Progressive Taxation) అని మారింది. అంతేగాదు; రుణనివారణ చేయమనీ, అప్పుల్లో యెక్కువ త్రోసివేత రావాలి అనీ, అలా తగ్గించిన అప్పులు వంతుల వారీగా తక్కువ మొత్తాలతో చెల్లించుకొనే యేర్పాటు వుండాలనీ, తక్కువ వడ్డీలు, వడ్డీ వ్యాపారస్తులపై తీవ్రమైన చర్యలూ, నీటివసతులూ, కౌలు సంస్కరణా కావాలనే మొదలయిన డిమాండ్లుకూడా చేర్చారు.

అసలు కౌలుసంస్కరణ అంటే యేమిటో పరిశీలిద్దాం.

1. కనామాదారు అప్పుడప్పుడు భూమిమీద తనకు హక్కు యేర్పడిందని తెలియచేయుటకు కట్టుకోవలసిన రుసుము రద్దుకావాలి. ఎందుకంటే, తిరిగి తనది భూమి అనేహక్కు తెచ్చుకోను 2½ సంవత్సరాల ఫీజు, (ఏదో కొద్దో గొప్పో జన్మీల దయకొద్దీ తగ్గించినా) జన్మీకిచెల్లించుకోవాలి. ఇది చెల్లించుకోలేకపోవడం అంటే జమీందారు కనామాదారుకు భూమి యివ్వకుండా వుండడం చట్టసమ్మతమే. అందువల్ల దీనిఫలితంగా చాలామంది బీదకనామాదార్లు నిజానికి భూమిని నిలుపుకోనూలేరు. లేక భూమిని తాకట్టుపెట్టితే డబ్బు చెల్లించుకోనూ లేరు. ధనిక కనామాదార్లు పై కోర్కెకు అనుకూలంగావున్నా, తమతోటి బీద కనామాదార్లవలె యీ కోర్కె సాధించను ఆతురత చూపలేదు. అంతేగాక ఆనాటికి జమీందారు యిష్టమొచ్చినట్లు నిరంకుశంగా నిర్ణయించబడుతూండిన రిన్యూయల్ ఫీజు (భూమిమీద తిరిగి హక్కు నిలబెట్టుకొనుటకు కట్టేడబ్బు) యితని లెక్కప్రకారం లెక్కించి నిర్ణయించబడుతుంది గావున, ధనిక కనామాదార్లు యించుమించు దానితో సంతృప్తిపడి వూరికుండిపోయారు గూడాను. కౌలుదార్లలోవున్న బూర్జువాతెగ (ధనికతెగ)కిది ఆకర్షణీయమైన కోర్కెగాదని అనవచ్చు. యెవరైనా దీనికొరకు పోరాడితే సహాయం చేయటం.

లేకుంటే ఊరుకోవడంతో సరిపోయింది వారిపని. కాని యిది బీద కనామాదారుకు తీరని సమస్య. యెందుకంటే, యీ సమస్యపైనే అతడు ఆధార పడాలి. భూమిని నిలబెట్టుకోవడమా, లేక అందులోనుండి తరిమి వేయించుకోవడమా అని అతని నిత్యసమస్య. కనామాదార్లలో బీదకనామా దార్లు 100కి 60 మంది వుంటారు. వీరంతా సొంతంగా వ్యవసాయం సాగించేవారే. అందువల్ల వరూంపటాదారు. జమీందారుకు వ్యతిరేకంగా సాగిస్తున్న పోరాటంలో ఈబీద కనామాదారువర్గంతోకలసి, వరూంపటామా దారుకు సహజ మిత్రుడుగా వుంటూ నూతన రైతువుద్యమ నాయకత్వము నకు అండగా నిల్చారు.

2. భూస్వామి తన సొంతసాగుకనే నెపంతో యిష్టమొచ్చినప్పుడు రైతులను భూమినుండి సాగనంపే హక్కు భూస్వామికిలేకుండా చేయాలి. కనీసం యీ హక్కును పూర్తిగా తగ్గించనైనా తగ్గించాలి. ఇది వ్యవ సాయం చేస్తున్న రైతుల కందరికీ సంబంధించిన కోర్కె. అందువల్ల యిది వరూంపటామాదారునూ, బీద కనామాదారునూ కలుపడానికి మరొక టిగా వుంటుంది. ఈ కోర్కెను జన్మిలు, యితర వ్యవసాయంచేయని వర్గాలవారు యేకముఖంగా వ్యతిరేకించారు. అందువల్ల యిది యీవ్యతిరేక వర్గాలనుకలిపే సమస్యగాగూడా వుపయోగపడింది.

3. వరూంపటామాదారుయొక్క కౌలునిర్ణయాన్ని ఆచరణలో వుప యోగపడకుండా చేస్తుండిన, "సంవత్సరాని కొకసారి పూచీగా సంవత్స రపు శిస్తు ముందే చెల్లించుకోవాలి" అనేదికూడా రద్దుకావాలి. ఈకోర్కెను వ్యవసాయకులు కాని అన్నివర్గాలు వ్యతిరేకించాయి. అందువల్ల యిది యీ వ్యతిరేకశక్తులను కలుపుటకు యింకొక అంకెలా పనిచేసింది.

4 చటంప్రకారం నిర్ణయించబడిన శిస్తు రేట్లుకూడా యింకా తగ్గించాలని కోరబడింది. అన్నిటికన్నా ముఖ్యమయింది అడవి వ్యవసా యాన్నిగురించి (ప్రతి సంవత్సరం కొంత అడవిని బాగుచేసి, వ్యవ సాయం చేసుకొనే భూములు) 1930 చట్టంక్రిందికి రాకుండా ఉన్నాయి. అలాంటి "పూనం" వ్యవసాయ భూములనుకూడా 1930 చట్టంక్రిందకు తెచ్చి న్యాయమైన శిస్తువుండేలా చేయాలి. ఆ చట్టంక్రిందికిరాని యితర వ్యవసాయ భూములనుగూడా ఆ చట్టంక్రిందికి తేవాలి.

అయితే యీకోర్కెలన్నీ వుద్యమం ప్రారంభంనుండీ కోరబడు తున్నా యనుకోకూడదు. ఈ కోర్కెలకు ఆచరణలో కాంగ్రెసు సోషలి స్టులు రెండు సంవత్సరాలు అనుభవం సాధించిన తర్వాత, ఒక నిర్ణీత స్వరూపం యిచ్చారు. నిజానికి 1937 లో వచ్చిన యెన్నికల సంరంభ ములో యీ కోర్కెలు ప్రజావ్యాపితమయ్యాయి. కాని ప్రారంభంనుండి కూడా యేదో అర్థంకాని రకంగా యీ కోర్కెలు తెలియజేయబడ్డాయి.

ఇంకా తెలుసుకోవలసిన విషయమేమిటంటే, సోషలిస్టులే కాంగ్రెస్ వారుగా రైతుల్లోపనిచేసి యీకోర్కెలకు స్వచ్ఛమైన స్వరూపం ఇచ్చారు. ఈ కోర్కెల నినాదాలు ప్రజావ్యాపితం చేసింది అతివాద కాంగ్రెసు కమిటీలు. రైతుసభలు జరిగినా, రైతుసంఘాలు తీర్మానించినా ఈవిషయంలో నాయకత్వం వహించింది కాంగ్రెసే. ఈ సందర్భంలో 1934 నుంచి 36 వరకు కేరళ రాష్ట్ర కాంగ్రెసు కమిటీలో సోషలిస్టులు యెక్కువమంది వున్నారనీ, 1936 నుండి రాష్ట్రసంఘంలోను, సగానికి సగం తాలూకా సంఘాల్లోను సోషలిస్టులే మెజారిటీగా వున్నారనేది జ్ఞాపకం వుంచుకోవాలి. ఈకాంగ్రెసు సంఘాలద్వారానే పై రైతుల కోర్కెలకొరకు ప్రజానీకమైన స్వరూపంతో ఆందోళన చేయబడింది.

గాంధీతత్వ కాంగ్రెసువాదులు వుద్యమం యీ స్థాయిలో వున్న ప్పుడు వ్యతిరేకించలేదు. కనామాదారుకు, వారికి చాలా దగ్గర సంబంధం వుందనేది సత్యం. వీరిలో యెక్కువమంది కనామాదారు కుటుంబాల్లో నుండే వచ్చారు ఆ వర్గంలోనే యెక్కువ తిరుగుతూ వుంటారు. అందు వల్ల వుద్యమం సాగిపోతూన్నప్పుడు, వుద్యమం ఒక నిర్ణీత స్వరూపం తీసుకొన్నప్పుడు, వీరు వుద్యమాన్ని వ్యతిరేకిస్తారనేది ముందుగా ఊహిం చిన విషయమే. కాని కొంతకాలం యీ వుద్యమం వారు వ్యతిరేకించవగి నంత ప్రమాదకరమైంది కాదని అనుకొన్నారు. అంతేగాకుండా రానున్న యెన్నికల్లో జయంపొందాలంటే యేదోరకమయిన అస్పష్టమయినదయినా రైతుకార్యక్రమం వుంటే వుపయోగకరంగా వుంటుందనేది గ్రహించారు. అందువల్ల వీరి ధోరణి అంతా "అనుకూల తటస్థతా" (Benevolent neutrality) గా వుండిపోయింది.

## అఖిల మలబారు రైతుసంఘం

నూతన భారతరాజ్యాంగ చట్టంక్రింద జరిగిన (1937) అసెంబ్లీ యెన్నికలు సామాన్యమయినవికావు. ఆ యెన్నికలు బ్రహ్మాండమయిన రైతు సమీకరణ అనిచెప్పాలి. కాంగ్రెసు యెన్నికల ప్రణాళిక పిలుపు మారుమూలనున్న రైతులనుసహితం నిద్రమేల్కొలిపింది. ఆ రోజుల్లో ఒక ఉపన్యాసకుడు అన్నట్లు "రైతులు తమవోటును తాము జమీందార్లకు చెల్లిస్తూ వున్న వివిధరకాల పన్నుల్లో ఒకటిగా యెంచక, తమ వోటు సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనకు కానుకగా యెంచి వోటుచేశారు." కాంగ్రెసు అభ్యర్థిని ఓడించిన జమీందారు అభ్యర్థియైన పాలెట్‌గారి నియోజకవర్గంలో తప్ప. మిగిలిన నియోజకవర్గాలన్నిటిలోనూ కాంగ్రెసుకు బ్రహ్మాండమైన విజయం లభించింది.

అన్నిటికన్నా ప్రాముఖ్యమయిన ఫలితం ఎర్‌నాడు-వల్లువనాడు తాలూకాల్లో, ముస్లిం నియోజకవర్గంలో వచ్చింది. ఇచ్చట కాంగ్రెసు అభ్యర్థి అయిన అబ్దుల్ రహిమాన్‌గారికి వ్యతిరేకంగా గవర్నమెంటు రిటైర్డు వుద్యోగిన్ని, మరొక ధనికుడున్నూ పోటీచేశారు. 1921 తర్వాత యీ ప్రమాదకరమైన ప్రదేశంలో అప్పుడే మొదటిసారి సభలూ, సమావేశాలూ జరిగాయి. 1921లో కాంగ్రెసు తమను బాధాకరమైన మార్గాన నడిపించి అనేక బాధలకు కారణమైంది గావున యిచ్చటి మాప్లా రైతులు కాంగ్రెసుకు వ్యతిరేకంగా వోటుచేస్తారని, జాతీయ విరోధులూ, కాంగ్రెసు వ్యతిరేకులూ చంకలెగురవేశారు. జాతీయవాదులు గూడా అలా జరుగుతుందేమోనని అదుర్దా పడ్డారు. దీనికితోడు అచ్చట నిలబడ్డ కాంగ్రెసు అభ్యర్థి మలబారు కాంగ్రెసు అభ్యర్థుల్లోకల్లా బీదవాడు. అంతేగాదు. గౌరవనీయులనుకోబడే బలవంతులైన ముస్లిములంతా కాంగ్రెసుకు వ్యతిరేకంగా పనిచేశారు. కాంగ్రెసు అభ్యర్థిని బలపరిచినవారిని, ప్రచారకులను "చీడీపిల్లగాండ్ల"ని ఎగతాళిచేశారు, కాని యిదంతా జరిగినా, ఆశ్చర్యకరమైన ఫలితం వచ్చింది. అబ్దుల్ రహిమాన్‌గారికి 28,000 వోట్లు వస్తే, వారి వ్యతిరేకులకు ఒకరికి 12,000, యింకొకరికి 10,000 వచ్చాయి. (యిది యిద్దరు అభ్యర్థుల స్థానం; అయినా కాంగ్రెసు ఒక్కరినే నిలిపింది)

రెండు తాలూకాల్లోనూ పెద్ద నాయకులనుకున్న వీరు, చీడీపిల్లగాండ్ల నాయకుడిచే ఓడింపబడ్డారు. 1921 సంవత్సర పోరాట పాఠాన్ని సరిగా అర్థంచేసుకొన్నాననీ, తను అనుభవించిన బాధలకు కాంగ్రెసు కారణం కాదనీ, యీనాటికైనా అధికారవర్గానికి వ్యతిరేకులను బలపరుస్తాననీ, అధికారవర్గానికి వ్యతిరేకి అని తలచబడ్డ అబ్దుల్ రహిమాన్‌కు వోటుచేయడం ద్వారా మాప్లా రుజువుచేశాడు. మాప్లా రైతు ధీమా నశించిపోలేదు. అతడు యీనాటికి కూడా మునుపటివలె పోరాటవాది యనేది స్పష్టం. 16 సంవత్సరములక్రింద తనను కాంగ్రెసునాయకులు వదిలివేసినా, మాప్లా కాంగ్రెసును వదలడు.

ఇంత ప్రాముఖ్యమైన ఫలితం కాకపోయినా అన్ని నియోజకవర్గాల్లోకూడ ఇలాగే కాంగ్రెసుకు విజయం లభించింది. ఈమూల ప్రసిద్ధి చెందిన ముసలివకీలై ఓడిపోతే, యింకోమూల చాలా పలుకుబడి గల్గిన "తియ్యతెగ"కు సంబంధించినవారూ, పెద్ద ధనికులూ పల్టీలుగొట్టారు. కాంగ్రెసు అభ్యర్థులు వారి విరోధులకన్నా ఏదో ఒకవిషయంలో తక్కువ అంతస్తులో వుండేవారు. అయినా కాంగ్రెసువారికి ప్రసిద్ధమైన శక్తివుంది. అదే రైతులయొక్క చైతన్యయుతమైన, ఉత్సాహకరమైన మద్దతు.

అందువల్ల 1937 వ సంవత్సరం రైతు వుద్యమాభివృద్ధిదశలో ఒక కొత్తదశ. కేవలం సోషలిజం కావాలని పనిచేసే కొద్దిమంది యువకులకు సంబంధించింది మాత్రమేగాకుండా, ఉద్యమ నినాదాలు రైతుల నిత్యజీవిత నినాదాలయ్యాయి. ఇదివరకువలె యేదో పైనుండి కాంగ్రెసు సంఘాల సహకారంతో పనిచేసేవిగాదు ఈనాటి తాలూకా రైతుసంఘాలు. ఈనాటి రైతుసంఘ సభ్యత్వం కేవలం రైతుల హక్కులకొరకు పోరాడే వారితోనే వుండిపోలేదు. రైతుసంఘాల్లో విపరీతంగా రైతులుచేరి, తమ సంఘాలుగా గుర్తించి సంఘ కార్యకర్తలను అప్పటమైన రైతుల్లోనుండి కూడా యెన్నుకున్నారు.

ఇలా 1937 సంవత్సరంలో కాంగ్రెసు యెన్నికల ప్రణాళికను బలపర్చి, యెన్నికలు విజయవంతం చేసిన రైతు సంరంభమే గాకుండా, అంతకుపూర్వంనుండీ కాంగ్రెసు సోషలిస్టులు యిచ్చిన నినాదాలు, కార్య

క్రమం, కోర్కెలను బలపర్చిన బ్రహ్మాండమైన రైతు సంరంభంకూడా జరిగింది. ఎందుకు కాంగ్రెసుకు వోటుచేశావయ్యా అని యే మలబారు రైతునైనా అడిగితే, తను కాంగ్రెసు యెన్నికల ప్రణాళిక విషయంలో మాట్లాడలేకపోయినా, తప్పకుండా "నేను నా హక్కుల సాధించడానికే వోటు చేశానని" రైతు సంఘ హక్కుల విషయంలో మాట్లాడతాడు. (5)

## బోగస్ బిల్లును రైతులు నలిపివేశారు

గాంధీవాదులు అనుకొన్నట్లు యెన్నికల్లో విజయవంతులయ్యారు. రైతులుకూడా వారేదైతే సాధించాలనుకున్నారో దాన్ని సాధించ నిశ్చయించుకున్నారు. ఎన్నికల సంరంభాలను తమసంఘాన్ని బాగా సంఘటితపరచడానికి ఉపయోగించుకొని, రైతులు నూతన మంత్రివర్గాన్ని తమకోర్కెల నెరవేర్చమని ఒత్తిడి చేయసాగారు. ఎన్నికలకు ముందు కాంగ్రెసు కమిటీలే రైతుల హక్కులనుగురించి చేసిన తీర్మానాలను, ఎన్నికల్లో కాంగ్రెసువారు చేసిన వాగ్దానాలను అమలుపరచమని, ఆచరణలో పెట్టమని ప్రతియొక్క సభావేదికనుండీ ఘోషించారు.

1930 సంవత్సరపు మలబారు కౌలుదారీ చట్టాన్ని సవరించడానికి కాంగ్రెసు మంత్రివర్గం ఒక బోగసుబిల్లును ప్రకటించింది. అప్పటి కప్పుడు అత్యవసరంగా పరిష్కరించబడవలసిన సమస్యలను ఒక్కదాన్ని కూడా ముట్టుకోకుండా యేదో అక్కడక్కడ కొన్ని మాటలు మార్పు చేసింది మంత్రివర్గం. ఇంకోరకంగా చెప్పాలంటే, ఈ సవరణ రాజకీయ వేత్త చేయదగిన సవరణ కానేకాదు. చిత్తులోవున్న కొన్ని మాట పొరపాట్లను సవరించడంమాత్రమే అవుతుంది. చట్టం ఆచరణలో పెట్టినప్పుడగుపడ్డ కొన్ని అవకతవకలు సర్దటం మాత్రమే. రైతులకు చెప్పనలవికాని సుఖాలనిచ్చే మార్పులు కౌలుదారీచట్టానికి తెచ్చామని యేదోరకంగా రైతుల కండ్లుమూయ నుద్దేశించారు యీ సవరణ బిల్లుద్వారా. ఇలా మాటలు సవరించుటకేనా రైతులు కాంగ్రెసును బలపరచింది?

కాని రైతులు యీ ఆటను సాగనివ్వకుండా చేయ నిశ్చయించుకొన్నారు. మలబారంతా, రైతుల నిజమైన హక్కుల, కోర్కెల తీర్చు సవరణలు బిల్లులో పెట్టాలంటూ యెడతెగని సభలూ, సమావేశాలు జరి

గాయి. కొన్ని తాలూకా సంఘాలు సవరణ తెలావుండాలో సూచిస్తూ తీర్మానాలు ప్రభుత్వానికి పంపాయి. గవర్నమెంటు బిల్లుకు వ్యతిరేకత యేమీ లేదు. కాని రైతులు అనాదిగా కోరుతూవచ్చిన బిల్లు యిదేనని, చేయ చూచిన మోసానికి వ్యతిరేకంగా రైతులు అసమ్మతిని తెల్పారు. "ఈబిల్లును ప్యాస్ చేయండి; కాని కేవలం బిల్లును తయారుచేసే మీ దృష్టిప్రకారమే కాకుండా, యెక్కువమంది రైతుల దృష్టిని కూడా పరిశీలించి బిల్లును సవరణ చేయండి" అని రైతులు అడిగారు.

ప్రభుత్వం వెంటనే బిల్లును రద్దుచేసుకోవలసి వచ్చేంత విశాలమైన ఆందోళన జరిగింది. మొట్టమొదటిసారి, తమ వర్గసంస్థయైన రైతుసంఘం ద్వారా రైతులు యీ బిల్లును నలిపివేసి, మొదటి విజయం సాధించారు. ఇదేరకంగా అభివృద్ధి నిరోధకులను తమ జాతీయసంస్థ (కాంగ్రెసు) ద్వారా యెన్నికలలో ఓడించి యింకో విజయాన్ని అంతకు కొలది మాసాలకు ముందే సాధించారు. అయినప్పటికీ రైతులు నిజంగా, వుపయోగకరమైన మార్పులు బిల్లులోతెచ్చి తమహక్కులు సాధించను యింకా పోరాడవలసివుంది. కాని ఒక్కవిషయాన్ని రైతులు రుజువుచేశారు. అంతకు ముందువరకూ యేవో సంస్కరణలు చూపి అవే న్యాయమైన హక్కులని చెప్పి రైతులకళ్లుమూయ ప్రయత్నించుట యికసాధ్యంకాదనేది రైతులు తెలియచేశారు. ఈ బోగసుబిల్లు రద్దుగావడంలో వున్న ప్రాముఖ్యత ఇదే.

## జమీందార్లకు వ్యతిరేకంగా మంత్రివర్గాన్ని బలపరచారు

మద్రాసు ప్రభుత్వం (కాంగ్రెసు ప్రభుత్వం) ప్రకటించిన రెండవ బిల్లు "మద్రాస్ వ్యవసాయకుల రుణనివారణబిల్లు". (Madras agriculturists' debt relief bill) ఈ బిల్లు జమీందార్ల కోపానికి యెంత తీవ్రంగా అయితే గురి అయిందో అంత ఆనందాన్ని కలిగించింది రైతుల హృదయాలకు. కాని యింతమాత్రంతో రైతుల అవస్థలన్నీ పూర్తిగా పోయి, రైతులు సుఖపడతారని రైతులుగాని, లేక వారి నాయకులుగాని భ్రమపడలేదు. అయినప్పటికి యిది ఒక అంగ ముందుకేసింది. జమీలహక్కులే

 గాకుండా, రైతుల కష్టాలను గురించి యిచ్చిన సూచనలనుగూడ గుర్తించవ

మనేది ఈ బిల్లులోని సుగుణం. అందువల్లే యిది రైతుల కెంతయితే ప్రియంగా కనుపించిందో అంత కంటకంగా జమీందార్లకు కనిపించింది.

బిల్లుకు వ్యతిరేకంగా జమీందార్లు తీవ్రమయిన ఆందోళన సాగించారు. జామోరిన్ మొదలయిన జన్మిలు సభలను, సమావేశాలను యేర్పాటు చేయుటకు సంచులు సంచులుగా డబ్బు క్రుమ్మరించారు. వారి తొత్తులు బిల్లుకు వ్యతిరేకంగా మెమోరాండం తయారుచేయ సిద్ధమయ్యారు. యేదో కొద్దిమంది బిల్లు లేకుండానే చెల్లించుకోగలవారికితప్ప యింకెవరికీ ఈ బిల్లు లాభంచేయదనీ, ముఖ్యంగా యెక్కువమంది బీదరైతులు దీని వల్ల పొందేలాభం యేమీలేదనీ మోసపు ప్రచారం తీవ్రంగా చేశారు జమీందార్లు

రైతువుద్యమం అంతకన్నా తీవ్రమైన సంఘటితఆందోళనను బిల్లుకు అనుకూలంగా చేసింది. జమీందార్లు ఆర్గనైజుచేసిన ప్రతి ఒక మీటింగుకు రైతుసంఘాలు, కాంగ్రెసుకమిటీలూ కలిసి 25 మీటింగులవంతున ఆర్గనైజుచేశారు. జమీందార్ల మీటింగుకు ఒక్కరెళ్ళితే 1000 మంది రైతుసభకు వచ్చేవారు. జమీందార్ల తరపున ప్రధానమంత్రి దగ్గరకు 2 రాయబారాలువెళ్లితే, తాలూకాలు తాలూకాలే చుట్టివేయగలిగిన బ్రహ్మాండమైన రైతువర్కర్ల యాత్రలూ, రైతుల యాత్రలూ యేకకంఠంతో జమీందార్ల నినాదాలు వినిపించకుండాచేయను వేలగొంతులు ఘోషించాయి. సుప్రసిద్ధుడునూ, నిపుణుడునూ అయిన కామ్రేడ్ ఏ. కె. గోపాలన్‌లాంటి రైతుసంఘ ఆర్గనైజర్ల బ్రహ్మాండమైన ప్రచారానికీ, ఆందోళనకూ వారి తీవ్రమైన విమర్శలకు, జమీందార్ల తొత్తులు తయారుచేసిన మెమొరాండం ముక్కలు ముక్కలయింది.

జమీందార్ల ఆందోళనకూ, రైతుల ఆందోళనకూ మధ్యవున్నభేదం యేమిటి ? జమీందార్లు అధికారంలోవున్న మంత్రులకు విన్నవించుకొంటే, రైతుసంఘం అధికారాన్ని అలంకరించినవారిని సృష్టించిన రైతులను సమీకరించేవారు. అందువల్ల జమీందార్ల ఆందోళనంతా యేదో గౌరవనీయులనబడే కొద్దిమందితో, ప్రజలయొక్క ప్రతినిధులమని నటించేవారి తలవాకిళ్లు దాటకుండానేవుండిపోయింది. కాని రైతువుద్యమబలం ప్రజల ప్రతినిధులమని చెప్పుకొంటూ ప్రజల మోసం చేస్తున్నవారిని నాశనం

చేయడంలోనూ, నిజమైన ప్రజాహక్కులను ప్రకటించడంలోనూ యిమిడి వుంది.

దీనిఫలితమేమిటి ? జమీందార్లకు అనుకూలంగా వున్నాయనుకొన్న సవరణలను రెండవమారు బిల్లు చర్చకువచ్చినప్పుడు మంత్రివర్గం నోటీసిచ్చికూడా చివరకు ఆ సవరణలను రద్దుచేసుకోవలసివచ్చింది. బిల్లు వున్నది వున్నట్లు రెండు సభల్లోనూ ప్యాసయింది. ఈమాదిరిగా జమీందార్లు రైతుల చేతుల్లో యెన్నడూ మరువరాని ఓటమినిపొందారు. ప్రజల ప్రభుత్వం ముందుకుతెచ్చిన సూచనను ప్రజలు బలపరచి రక్షించారు.

## అఖిల మలబారు రైతుసంఘ స్థాపన

ఈ పని అంతా తాలూకా రైతుసంఘాల ఆధ్వర్యాన జరిగింది. రైతువుద్యమాన్ని సమీకరించి యేకముఖంగా నడపడానికి కేంద్రసంఘం అప్పటికింకా యేర్పడలేదు. క్రింది సంఘాలేర్పడి పనిచేయనంతకాలం, పైన యేదో పేరుకు కేంద్రసంఘమంటూ ఒకటుండడం అనవసరమని నాయకత్వం తలచింది. ఏవయినా రాష్ట్రవ్యాపితం చేయవలసినపని వున్నట్లయితే అది కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యనిర్వాహకవర్గం చేసేది. రైతులకొరకు రైతు కోర్కెలను ప్రచారంచేయుటేపనిగావున్నంత కాలం యీ యేర్పాటు చక్కగా పనిచేసింది.

కాని యెప్పుడైతే గ్రామాల్లో, తాలూకాల్లో సంఘాలేర్పడి పని చేయ ప్రారంభించాయో అప్పుడు పరిస్థితులు మారాయి. అందువల్ల అఖిల భారత రైతుసంఘానికీ - తాలూకా సంఘాలకూ మధ్య ఒకలింకుగా వుంటూ, సంఘాల పనిని సమీకరించి నడపడం యిప్పుడవసరమయింది. అందువల్ల ఒక కేంద్రసంస్థ వుండడం తప్పనిసరి అయింది. 1938 మేనెలలో అఖిలమలబారు రైతుసంఘస్థాపన జరిగింది. చిరక్కాల్ తాలూకా రైతుసంఘ కార్యదర్శిగా వుండి, రైతులను చక్కగా అన్నిసమస్యలపైనా సమీకరిస్తూ తన నిర్మాణశక్తిని ప్రదర్శించిన కామ్రేడ్ కేరళియన్‌ను దీనికి కార్యదర్శిగా యెన్నుకొన్నారు. కామ్రేడ్ కేరళియన్ మలబారులో ప్రముఖ

 రైతుసంఘ ఆర్గనైజరు. వీరు తర్వాత రహస్యజీవితం గడుపవలసి

వచ్చేంతవరకూ రెండు సంవత్సరాలపాటు కార్యదర్శిగా పనిచేశారు. రైతు సంఘాన్ని అంత గొప్పగా నిర్మించిన గౌరవమంతా వీరికే చెందుతుంది.

అఖిలమలబారు రైతుసంఘంలో నిర్మాణయుక్తంగా పనిచేస్తుండినవి మూడు తాలూకాసంఘాలు మాత్రమే. (హోస్‌మర్గ్-చరకాల్-కొత్తాయం) కురుంబ్రనాడు తాలూకాలో చక్కటి ఫిర్కాసంఘం కూడా వుండేది. దక్షిణ మలబారులో కూడా క్రిందిసంఘాలు సరిగా పనిచేయకపోయినా తాలూకా సంఘాలు మాత్రం వుంటూవుండేవి. దీని ఫలితంగా వుత్తర మలబారు ఆందోళనాదశ దాటి క్రిందినుండి పైవరకు రైతుసంఘాలు నిర్మాణ యుక్తంగా పనిచేస్తూ రైతులకు మార్గదర్శకంగా వుంటే, దక్షిణమలబారు కేవలం 1937 కు ముందున్న స్థాయిలోనే, అంటే, కేవలం ఆందోళనావస్థ లోనే వుండిపోయింది. చరకాల్ - కొత్తాయం తాలూకాల్లో ప్రతి గ్రామం లోనూ రైతుసంఘం వుండడం, తాలూకా సంఘాలు ఆఫీసులు కలిగి నిత్యం నిర్మాణయుతంగా పనిచేస్తుండేవి. తమ గ్రామసంఘాల ఆజ్ఞలను రైతులు ఒకచట్టంగా భావించి అనుసరిస్తూ వుండేవారు. రైతుసంఘం తనను సంఘంనుండి తొలగిస్తే. కోర్టులు వేసేశిక్షకన్నా కఠినంగా తలచే వాడు రైతు, రైతుసంఘ విరోధులు ప్రతి రైతుకుటుంబానికి విరోధు లుగా యెంచబడేవారు రైతుసంఘ విద్రోహులకు దయచూపడం అనేది తీవ్రమయిన నేరాన్ని బలపరిచినట్లుగా తలచబడేది.

ఈ విధంగా రైతుసంఘం ఒక నూతన నీతిని, సాంఘిక, రాజ కీయ ప్రవర్తనలో మార్పును తెచ్చింది. ఇంతకన్నా గొప్ప విషయం సాంఘిక వ్యవస్థలో వచ్చినమార్పు కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమంకన్నా యిది సాంఘికవ్యవస్థలో గొప్పవిప్లవకరమైన మార్పును తెచ్చింది. అలవాటుగా త్రాగుతున్న ముసలిరైతులు సహితం త్రాగుడు నిలిపివేయడం జరిగింది. మరీ త్రాగుడు నిల్పలేక తంటాలుపడుతున్న రకం త్రాగుతున్నం దుకు సిగ్గుపడేవారు. అంతేగాక యేమయినా ముఖ్యమైన పండుగదినాలలో అంటే, యెవరో నాయకులు వారిగ్రామానికి వచ్చిన రోజుల్లాంటి దినాలలో త్రాగకుండా వుండేవారు. సనాతన రైతులు తమపురాతన సాంఘిక దురభి ప్రాయాలను వదలివేశారు. దేవాలయ ప్రవేశంకొరకు గొప్పగా ప్రచారం జరిగిన రోజులకన్నా యీ దశలో రైతులు రైతుసంఘంలో చేరడమే

తదవుగా చాలామంది అంటరానివారనే దురభిప్రాయం వదిలివేశారు. కామ్రేడ్స్ కేరళియన్; ఎ. కె. గోపాలన్‌లు దేవాలయ ప్రవేశ ప్రచారం (వారూ - వీరూ అనే విచక్షణలేకుండా అంతా దేవాలయాల్లో ప్రవేశించవచ్చు అనేప్రచారం) చేస్తున్న రోజుల్లో వారిని నిస్పృహ తప్పిపోయేలా కొట్టిన వరకాల్ తాలూకా ఒకగ్రామంలోనివారు, ఈదశలో తమగ్రామంలో రైతుసంఘం స్థాపించి వుత్సాహకరంగా పనిచేయ ప్రారంభించారు. సంఘంలోచేరి యిలాంటి పురాతన బూజుపట్టిపోయినమూఢనమ్మకాలకూ, ఆచారాలకూ, స్వస్తిచెప్పిన కుటుంబాలెన్నో వున్నాయి. ఇదంతా ఆచరణలో జరిగిపోతూవున్నా, ఏ రైతుసంఘమూ యిలాంటి కార్యక్రమం చేయమని చెప్పడంగాని, లేక సంఘకార్యక్రమంలో ఒకభాగంగా తీసుకోవడంగాని చేసిందిలేదు. రైతుసంఘ సభ్యుడు అంటరానితనాన్ని అంటిపెట్టుకుని వుండవచ్చు. యిష్టపడితే త్రాగవచ్చు. కానిపోరాటంలోనూ - సమీకరణలోనూ సాధించిన వర్గఐక్యత తప్పనిసరిగా రైతుల సాంఘికవ్యవస్థలో పెద్ద విప్లవకరమైన మార్పును తెచ్చింది.

## చరిత్రాత్మకమైన రైతుయాత్ర

1938 డిశెంబరునెల్లో జరిగిన చారిత్రాత్మకమైన మలబారు రైతుయాత్ర రైతుల చైతన్యాన్ని, వారినాయకుల నిర్మాణశక్తిని ప్రదర్శించింది. డిశెంబరు 18 వ తేదీన యీ రైతువర్గం అనే మహావృక్షంయొక్క రెండు శాఖలూ (కూలీ-రైతులు) కాలికట్టుపట్టణ సముద్రతీర మైదానంలో కలిశాయి. బ్రహ్మాండమయిన కూలీ-రైతుల తిరునాళ్ళ జరిగింది. కరివేళ్ళూరునుండి ఒకదళం, 18 సంవత్సరాల రైతుయువకులనుండి చావుకు తయ్యారయిన ముసలిరైతులతో సహా 200 మందితో 100 మైళ్లు నడచి కాలికట్టు చేరింది. కోయంబత్తూరు మలబారు సరిహద్దులలోవున్న కంచికోట నుండి యింకోదళం వందమందితో అలానే నడిచి కాలికట్టు చేరింది. దీనికి ఒకవారంముందు హోసదుర్గ్ తాలూకానుండి రైతులుమెంగుళూరుకు యాత్రచేశారు. (ఈ తాలూకా గవర్నమెంటు లెక్కప్రకారం సౌత్ కనరా జిల్లాలో వుంది. అయినా అచ్చటి ప్రజలంతా మళయాళం మాట్లాడతారు) అడవిప్రదేశమైన వేనాడుతాలూకా మినహాయించితే, మొత్తం అన్ని

తాలూకాలనుండి 300 వందలమంది రైతులు జిల్లాఅంతా యాత్రచేసి వచ్చారు. యాత్రనుంచి వస్తున్నవారికి ఆహ్వాన మివ్వటానికీ, యింకా యితర యేర్పాట్లు చేయటానికీ జిల్లా అంతటిలోనూ యించుమించు 2000 మంది యువకులు స్థానిక ఆహ్వానసంఘాల్లోగానీ, కేంద్ర ఆహ్వానసంఘాల లోగాని పనిచేశారు. ఇక స్థానికంగా జరిగిన సభల్లోనూ, సమావేశాల్లోనూ, కేంద్రంలో జరిగిన సభల్లోనూ పాల్గొన్న ప్రజల లెక్కచెప్పవలసివస్తే ఒక లక్ష జనాభాకన్నా తక్కువ వుండదని చెప్పవచ్చు.

కేరళరాష్ట్ర చరిత్రలో యిలాంటియాత్ర అపూర్వం. మలబారులో యిది మొదటియాత్ర యేమీగాదు; 1930 లో కాలప్పన్‌గారి వుప్పుయాత్ర. ఎ. కె. గోపాలన్‌గారి దేవాలయ ప్రవేశ యాత్రలు - 1938లో కామ్రేడ్స్ చంద్రోత్ - గోపాలన్‌గార్ల ఆధిపత్యాన జరిగిన ఆకలియాత్రలూ మొదలయినవి మలబారుకు పరిచయం కలిగించాయి. కాని అవన్నీ కేవలం కొద్దిమంది యువకులచేత నడుపబడ్డ యువకయాత్రలే కాని, యీ యాత్ర అలా కాకుండా నిజమయిన రైతుపుత్రులందరితో గూడిన రైతుయాత్ర. ఈ యాత్రకు పూర్వం జరిగిన యాత్రలన్నీ ప్రజలు తరతరాలుగా అనుభవిస్తుండిన అజ్ఞానమనే నిద్రనుండి మేల్కొల్పే ప్రచార యాత్రలయితే, యీ యాత్ర ప్రజలలో జరిగిన నిర్మాణానికీ, వచ్చిన చైతన్యానికీ ఫలితం. పూర్వపు యాత్రల్లో పాల్గొన్నవారుగాని, లేక నాయకులుగాని ప్రజలకొరకు యాత్రలుచేస్తే, యీయాత్రను ప్రజలే నడిపారు. యింతకుముందు జరిగిన యే ప్రదర్శనం కూడా ఇంతమంది రైతులను ఆకర్షించి వుండలేదు.

యాత్రయొక్క ఆవశ్యకత యేమి? ప్రభుత్వ దృష్టిని రైతుల కష్టాలపై కేంద్రీకరింపచేసి, ప్రభుత్వాన్ని తమ హక్కులను గుర్తించేలా చేసి, ఆహక్కుల నివ్వటానికి, కష్టాలను తీర్చటానికి అవసరమైన చట్టాలను చేయటానికీ, కార్యనిర్వాహక చర్యలను తీసుకోటానికీ ప్రభుత్వాన్ని పురిగొల్పడానికే యీ యాత్ర వుద్దేశించబడింది. ఈ యాత్రలు కాలికట్టు సమీప గ్రామంలో చేరి, కామ్రేడ్ కె. పి. ఆర్. గోపాలన్‌గారి అధ్యక్షత క్రింద అఖిల మలబారు రైతుమహాసభ సమావేశమైనాయి.

నిరంకుశ ప్రభుత్వం దీన్ని సహిస్తుందా? యాత్రను ఆపుటకు జిల్లా కలెక్టరు వుబలాటపడ్డాడు. కాని, కాంగ్రెసు మంత్రివర్గ హయాములో అధి

కార బలముపయోగించి యాత్రను ఆపడం సాధ్యం కాదనేది అతడు గ్రహించాడు. అందువల్ల ఒక యెత్తువేశాడు.

కిసాన్‌సభా కార్యదర్శి అయిన కామ్రేడ్ కేరళియన్ యాత్రను యెప్పుడు కలుసుకో వీలవుతుందో తెల్పమని కలెక్టరుకు వ్రాశాడు. దీనికి జవాబుగా కలెక్టరు ముందుకేంళియన్‌తో మాట్లాడి, తర్వాత తేదీనిర్ణయించి తెలియచేస్తానని జవాబుపంపేడు. కామ్రేడ్ కేరళియన్ ప్రచారకార్యక్రమంలో వున్నాడు. గావున 2, 3 రోజులతర్వాత దీనికి సమాధానం వ్రాయగలిగాడు. ఈ లోపున డిశెంబరంతా యేదో తన కార్యక్రమంకొరకు నిర్ణయించుకొని యాత్రను ఆహ్వానించలేనంటూ కలెక్టరు కామ్రేడ్ కేరళియన్‌కు తిరిగి వ్రాశాడు. యాత్రకు యేర్పాట్లన్నీ పూర్తి అయ్యాయని అతనికి తెలుసు. అందువల్లే ఆఖరు నిమిషంలో చూడనిరాకరిస్తే రైతుల్లో కంగారొచ్చి యాత్ర ఆగిపోతుందని అలాచేశాడు. నిరంకుశోద్యోగులు పనిచేయ నిరాకరిస్తే, మేంప్రజలద్వారానే ప్రభుత్వానికి తెలియచేస్తామనీ, యాత్రాకార్యక్రమం యేమయినాసరే పూర్తిచేస్తామనీ, కామ్రేడ్ కేరళియన్ ప్రకటించాడు. భేద మేమిటంటే, కలెక్టరుకుమారుగా రైతుం మెమొరాండంను కాలికట్టుప్రజలు అందుకొంటారు. ప్రజాప్రభుత్వ పరిపాలన అమల్లోవుంచిగాన యిదే చాలు.

కలెక్టరును ఆయనక్రింది వుద్యోగులైన రివిన్యూవుద్యోగులు, పోలీసు వుద్యోగులు మించిపోయారు. ఆయనక్రింది వుద్యోగులు పల్లెల కెళ్ళి కలెక్టరు యాత్రను దర్శించే అవకాశం లేదనీ, అందువల్ల యాత్ర నిరుపయోగమనీ ప్రచారం చేశారు. చిరక్కాల్ తాలూకాలో డిప్యూటీ తహసీల్‌దారు ఇలాగని ఒక సర్క్యులర్‌కూడా గ్రామాలకు పంపేడు. కొంతమంది ఆఫీసర్లు అసలు యాత్రనే నిషేధిస్తారని చెప్పేంతదూరం పోయారు. కాని యీ కుట్రనుగురించి రైతులకు బాగా తెలుసు.

## జన్మి — ఆఫీసర్ల కుట్ర

ఇది యిలా జరుగుతున్నప్పుడే ఆఫీసర్లు - జన్మిలు కలసి కిసాన్ సభకు వ్యతిరేకంగా కుట్రలుపన్న మొదలెట్టారు. కలెక్టరు యాత్రనుచూడ నిరాకరించడం దీనికి అంకురార్పణ. వివిధరకాల కృత్రిమాలతో యేదో రకంగా రైతులపై క్రిమినల్ ప్రాసిక్యూషన్‌లు ప్రారంభించారు. (కాని

రైతునాయకులను ఈ దశలో ముట్టుకోలేదు యెందుకంటే, రైతులైతే యీ బాధల కోర్వలేక సులభంగా లొంగిపోయి తమవలలో పడతారని ఆశించారు). ఇతరులను జడిపించి లొంగదీసుకో ప్రయత్నించారనీ, లూటీలు చేశారనీ, సాంఘికబహిష్కరణ సాగించారనీ, రకరకాలైన నేరాలతో నిర్బంధవిధానం సాగించారు. (8)

కాని కుట్రదారుల ఆశలు నిరాశలయ్యేలాగు యీ నీతిమాలిన కుట్రలన్నీ రైతుల సంఘటితశక్తినీ, వారి కట్టుబాటును అధికంచేశాయి. ఎక్కడ బడితే అక్కడ డిఫెన్సు కమిటీలు స్థాపనకావడం, అవసరమైన డబ్బు వసూలుచేసి, వకీళ్ళనుపెట్టి కేసులన్నీ నడిపించడం జరిగింది. దీని ఫలితంగా చాలాకేసులు ఆధారరహితములని ముద్దాయీలు వదలివేయబడ్డారు. ఈ సందర్భంలో కామ్రేడ్ కె. పి. ఆర్. గోపాలన్, తన ప్రజాసమీకరణాశక్తిని, వేలమందిని ఆకర్షించగల తీవ్రతరమైన వుపన్యాసశక్తినేగాకుండా, వకీళ్ళకు అప్పటికప్పుడు తగిన సలహాలిచ్చి కేసులను వోడించడంలో కూడా తన నైపుణ్యాన్ని ప్రదర్శించాడు. తమ నాయకుడు కేవలం వుపన్యాసాలివ్వడం, ప్రజలను సమీకరించి వారికి పోరాటశక్తి నివ్వడమే గాకుండా, తమకు కష్టసమయాల్లో సహితం తలలో నాలుకలా ప్రవర్తించి, తగిన సలహాలిచ్చే ధీమాగల పురుషుడనీ, మంచికయినా, చెడ్డకయినా వారిమీద ఆధారపడవచ్చునే నమ్మకం రైతులకేర్పడింది. ఇలా కేసులలో పాల్గొని రైతులను రక్షించడంద్వారా కామ్రేడ్ గోపాలన్, అతని అనుచరులూ అధికారి - జమీందార్ల కుట్రలపై చావుదెబ్బగొట్టి రైతుసంఘాన్ని కాపాడారు.

ఇచ్చట గాంధీ వాదులను గురించి ఒకమాట చెప్పవలసి వుంటుంది. ఆశ్చర్యకరమయిన విషయం యేమిటంటే, యీ రోజుల్లోనే కేరళ గాంధీసంఘాన్ని స్థాపించడం, చాలాచోట్ల గాంధీవాదులే జమీందార్ల తరపున మాట్లాడడం జరిగింది. గాంధీవాదుల నాయకుడైన కాలప్పన్‌గారు రైతుసంఘ కార్యక్రమం కొన్నివిషయాల్లో సత్యా - అహింసల సిద్ధాంతాలకు వ్యతిరేకమని ఖండిస్తూ ప్రకటనలు చేశాడు. వీరి అనుచరులు ప్రముఖపాత్ర వహించి వీలైన అన్ని అవకాశాల నుపయోగించుకొని రైతుసంఘానికి వ్యతిరేకంగా పనిచేశారు. చరక్కాల్, హోసదుర్గ్ తాలూకాల్లోని

జన్మీలంతా యెక్కువమంది యీ గాంధీసంఘాల్లో చేరారు. ఈ పైపనంతా గాంధీవాదుల సంఘటితశక్తిని (Organisational strength) బలపరచక పోగా, నిజమైన జమీందారీ ఏజెంట్లుగా, స్నేహితులుగా రైతులముందు బట్టబయలు చేసింది.

## టెనెన్సీ కమిటీ (Tenancy committee)

రైతు వుద్యమ ముఖ్యకోర్కె 1930 మలబారు కౌలుదారీ చట్టమునకు తగిన సవరణలు చేయించడమే. ఈ ముఖ్యకోర్కె ఉత్తర మలబారులోని రైతులను ఉత్తేజపరచి వారిని కాలికట్టుకు, మంగుళూరుకు యాత్రలు జరిపేలా చేసింది. ఆనాటి రెవిన్యూమంత్రిగారైన ప్రకాశంగారి అధ్యక్షతను జరిగిన జమీందారీ కమిటీయొక్క అభివృద్ధికరమయిన సలహాలు కాంగ్రెసు మంత్రివర్గం అధికారంలో వుండటం వల్ల "మన హక్కులు మనం సాధించగలం" అనే ఆశను రైతుల్లో రేకెత్తించాయి.

కాని యెలానైతేనేం యిక్కడొక భేదముంది. ఇంకా జమీందార్ల క్రిందే వున్నారు గావున పైతరగతి కౌలుదార్లు పోరాడవలసిన ఆవశ్యకత వుంది. కాని మలబారులోని కనామాదార్లు యేదయితే కోరుతూ వుండిరో అది 1930 చట్టంవల్ల యించుమించుగా పొందారు, అందువల్ల బిల్లుకు యేలాంటిసవరణ వచ్చినా అదివారికి లాభదాయకం గాకపోగా నష్టం కలిగిస్తుంది.

అందువల్లనే మంత్రివర్గం మలబారుకూ - జమీందారు ప్రదేశాలకూ, వ్యవసాయకుల సమస్య విషయంలో భేదం చూపించింది మలబారు కౌలుదారీ కమిటీ స్థాపన, జమీందారీ కమిటీ రిపోర్టు ప్రకటించిన ఆరునెలలకు జరిగింది. ఈ కమిటీ నియమిమింపబడిననాటి పరిస్థితులేమిటి ? ఈ కమిటీలో స్వచ్ఛమయిన యిద్దరు జన్మీలు వున్నారు. వీరిద్దరూ అసెంబ్లీలో జన్మీలతరపున ప్రతినిధులు. అఖిల మలబారు రైతుసంఘం తరపున ఒక ప్రతినిధిని కూడా కమిటీలోకి తీసుకోలేదు. అన్నిసమయాల్లో రైతు సంఘాన్నే బలపరస్తూ వుండిన 3 గురు ఎం. ఎల్. ఎ. లు కమిటీలో వున్నారనేది సత్యమే. కాని దీనికి వ్యతిరేకంగా కనామాదార్లకు ప్రాతినిధ్యం వహించినవారు ఒక డజనుమంది వున్నారు. ఈ విధంగా కాంగ్రెసు

మంత్రివర్గం యేర్పరచిన మలబారు కౌలుదారీ విచారణకమిటీలో 2 రు జమీందార్లు, 3 రు రైతుసంఘ సానుభూతిపరులూ, ఒకడజను కనామాదార్లతో యేర్పడ్డ కనామాదార్ల కమిటీ అని చెప్పవచ్చు. ఈ కమిటీయే మలబారు టెనెన్సీ విచారణ జరిపి, పరిస్థితులను చక్కబెట్టాలి.

ఈ కమిటీ స్వరూపాన్ని చూచి రైతులు అసంతృప్తిచెందినా, దీన్ని వుపయోగించుకొని గొప్ప ప్రజావుద్యమాన్ని నిర్మించ నిర్ణయించుకొన్నారు. కమిటీ యెచ్చటికైతే పరిస్థితుల పరిశీలనకు వెళ్ళిందో అచ్చటంతా రైతులు బ్రహ్మాండమైన ర్యాలీలు, సభలు జరిపి కమిటీని ఆహ్వానించి, తమ కోర్కెలనూ, హక్కులనూ అంగీకరించమని ఆందోళన చేశారు. రైతుసంఘం తరపున సాక్ష్యమిచ్చినవారిని సామాన్యప్రజలే కాకుండా 25 వేలమంది రైతుసంఘసభ్యు బలపరుస్తున్నా ఇద్దరు ముగ్గురిని మాత్రమే రైతుసంఘంతరపున సాక్షులుగా విచారించారు. కామ్రేడ్సు నారాయణనాయర్, కేరళియన్, భరతయ్యనులు సాక్షులలోవున్నారు. కమిటీసమావేశాల్లో కమిటీమెంబర్ల ప్రవర్తనగాని, వారి సిఫార్సులుగాని అనుకొన్నట్లే జరిగాయి. కమిటీలోవున్న రైతుసంఘ సానుభూతిపరులు ముగ్గురు తప్ప. మిగతావారు. కమిటీచైర్మెనూ రైతుల ప్రదర్శనాలు జరుగకుండా చేయాలని చాలా శ్రద్ధగా పనిచేశారు. ఇక సాక్షుల విచారించడంలో, ప్రజల కోర్కెలను. హక్కులను కాపాడుతూ ప్రజలవిరోధులను బహిరంగపరిచే విచారణగా గాకుండా. కోర్టులలో వకీళ్ళు క్రాస్‌చేస్తున్నట్లుగా వారు ప్రవర్తించారు, ఒక కే. మాధవమీనన్‌గారు తప్ప మిగతా గాంధీవాదులంతా రైతుసంఘ ప్రతినిధులను కిందామీదాచేసి క్రాసుచేయడంలో వారినైపుణ్యాన్ని ప్రదర్శించారు.

ఇక కమిటీయిచ్చిన సలహాలవిషయాని కొద్దాం. ఇదికూడా అపాటే పాడింది. జమీన్‌దారీ ప్రతినిధియైన అర్. యం. పాలెట్‌గారు యిలా అన్నారు. " నాకు మెజారిటీరిపోర్టుతో భేదించాలనే వుద్దేశంలేదు. అయినా రైతుసంఘంవారు మెజారిటీ సలహాలపై భేదిస్తూ రిపోర్టులు వ్రాస్తున్నారు. గావున నేనూ వ్రాస్తున్నా". ఇలా యీయన మెజారిటీనిర్ణయాల నంగీకరిస్తున్నట్లు రుజువుచేశారు. యెందుకంటే మెజారిటీరైతుల ముఖ్యకోర్కెలను నిరాకరించింది. చట్టంలోవున్న కొన్ని నామమాత్రపు మార్పులు

చేయ నంగీకరించి ముఖ్యకోర్కెలను తిరస్కరించారు. కనామాదారుకు భూమి తిరిగి తమదనే హక్కు నిర్ణయంకొరకు కట్టుకోవలసిన ఫీజు విషయం అలానే వదిలేశారు. వరూంపటామాదారునుండి పూచీగా ప్రతి సంవత్సరం కొంత శిస్తు తీసుకొనేపద్ధతి ఆలానే ఉంచారు. ఇక శిస్తులో తగ్గింపు మొదలైనవి యేమీ చేయలేదు. "రైతు సంఘాలు కమిటీ యిచ్చిన సూచనల నంగీకరిస్తే నేనూ అంగీకరించ సంసిద్ధంగావున్నాను. లేనిచో కమిటీచేసిన కొద్ది మార్పులకుకూడా నే నంగీకరించను" అంటూ పాలెట్‌గారు వాదించారు. ఈవిధంగా జన్మి-కనామాదార్లు వరూంపటామాదార్లకు నష్టకరమైన ఒక సమాధానానికి వచ్చారు. 1930 లో ప్రారంభమైన యీ క్రమం 1940 లో పూర్తి అయింది.

# 3. సామ్రాజ్యవాద యుద్ధం - నిరంకుశ నిర్బంధ విధానం

రెండవ సామ్రాజ్యవాద యుద్ధం ప్రారంభమయ్యేటప్పటికే ఇంచుమించు మలబారు కౌలు విచారణకమిటీ పని ప్రారంభమైంది. హిందూదేశంకూడా జర్మనీపై యుద్ధం ప్రకటించినట్లు వైస్రాయి ప్రకటించడం, కాంగ్రెసు వర్కింగు కమిటీ వార్ధా తీర్మానం, అన్నివిధాలైన రాజకీయ కార్యకలాపాల నిషేధిస్తూ ప్రకటించిన హిందూదేశ రక్షణ చట్టం మొదలైన రాజకీయమార్పులు రైతులపై తీవ్రంగా పనిచేశాయి. అంతేగాకండా రైతులు వుత్పత్తిచేస్తున్న సరకుల ధర తగినంత పెరగకుండా, రైతులు కొనవలసిన బజారు సరకుల ధరలు విపరీతంగా పెరిగిపోవడం మొదలైనవి రైతులలో తీవ్ర ఆందోళనను కలిగించాయి. దీని ఫలితంగా అఖిల మలబారు రైతువుద్యమం తప్పనిసరిగా రాజకీయ రంగంలో ప్రవేశించవలసివచ్చింది. అందువల్ల రైతులు జరిపిన సభలూ, టెనెన్సీ కమిటీవచ్చినప్పుడు జరిపిన ప్రదర్శనాలు అన్నీ—చాలావరకు యుద్ధ వ్యతిరేక రాజకీయ ప్రదర్శనాలే.

## యుద్ధవ్యతిరేక పోరాటంలో రైతుల ప్రముఖపాత్ర

యుద్ధానికి ముందుకూడా మలబారు రైతువుద్యమం చాలావరకు రాజకీయ వుద్యమంగా వుండేది. ఉత్తర మలబారులో యెక్కడైతే రైతువుద్యమం బలంగావుందో, అచ్చట కాంగ్రెసు కమిటీలు, రైతుసంఘాలు విభజించలేనంత కలయికతో పనిచేస్తుండేవి. రెండు సంఘాలూ ఒకే వ్యక్తులచే నడపబడడమే గాకుండా, రైతులందరూ ఏకంగా కాంగ్రెసులో చేరడమే గాకుండా, ఉత్తర మలబారులో యెక్కువమంది కాంగ్రెసు వలంటీరులు రైతుబిడ్డలు-కాంగ్రెసు వాదులైన రైతునాయకులద్వారా రాజకీయ చైతన్యమొంది రాజకీయ రంగంలో ప్రవేశించిన రైతుబిడ్డలు. 46

ఈ కాంగ్రెసు - రైతు సమిష్టి వుద్యమమంతా, "ఫెడరేషనుకు, యుద్ధానికీ వ్యతిరేకంగా పోరాడాలి" అనే నినాదాలపైన అభివృద్ధి అయింది. ఫెడరేషనేమో సహజంగా చచ్చింది. యుద్ధం ఎప్పుడో భవిష్యత్తులో వచ్చే ప్రమాదం అనుకోడానికి వీల్లేకుండా వెంటనే యెదుర్కొనవలసిన సమస్య అయింది. అందువల్ల కిసాన్ వాలంటీర్లు, రైతులు యుద్ధాన్ని వ్యతిరేకించడం అవసర సమస్యగా తీసుకొన్నారు.

యుద్ధం ప్రారంభ దినాల్లో రైతులు మేల్కొని తీవ్రమయిన యుద్ధ వ్యతిరేక వుద్యమంలో దిగారు. కాంగ్రెసు తీర్మానాలను యెలా ఆచరణలో పెట్టాలో తెలియచేయనూ, యుద్ధంయొక్క నిజస్వభావాన్ని బహిరంగ పరచనూ మలబారంతా యెడతెగని మీటింగులు, వుత్సవాలు, యాత్రలు జరిగాయి. దేశంలో ప్రాకుతున్న రాజకీయ అసంతృప్తికి సరియయిన స్వరూప యిచ్చి ఒక చైతన్యవంతమైన పోరాట మార్గంలో అసంతృప్తిని దెలుపుటకు వాలంటీరు దళాలన్నీ అలసటనేది యెరుగకుండా పనిచేశాయి.

కేరళరాష్ట్ర కాంగ్రెసు యెన్నికలు, రాంఘరు కాంగ్రెసు యెన్నికల వల్ల నిజంగా రైతువుద్యమం కాంగ్రెసులోవున్న అతివాదతత్వానికి యెంత బలమిచ్చిందో తెలిసికొన వీలైంది. ఆనాడు జరిగిన యెన్నికలు కేరళరాష్ట్ర కాంగ్రెసు చరిత్రలో తీవ్రంగా పోటీపడ్డ యెన్నికలు. సోషలిస్టులను వోడించి గాంధీవాదులను గెలిపించుటకు, మిల్లుయజమానులు, పెట్టుబడిదారులు, భూస్వాములు, జమీందార్లు వారు వీరేమిటి అన్నిరకాల అభివృద్ధి నిరోధకులూ ఒకరినొకరు మించి డబ్బు ఖర్చుపెట్టారు. ఇంత రాద్ధాంతం జరిగినా యెచ్చటయితే రైతువుద్యమం బలంగావుందో అచ్చట సోషలిస్టులు స్థానాలను సంపాదించారు. యెచ్చటయితే రైతువుద్యమాన్ని సంఘటితపరచడంలో విఫలులైవారో అచ్చట గాంధీవాదులు సోషలిస్టులను అలాగే ఓడించారు.

## కొచ్చిన్ సంస్థానంలోకి రైతు వుద్యమం ప్రవేశించింది

ఈ కాలంలోనే మలబారులో ముఖ్యంగా ఉత్తర మలబారులో కేంద్రకరించబడింది రైతువుద్యమం. 1939 ఆఖరి దశలోనూ, 1940 ప్రారంభంలోనూ కొచ్చిన్ సంస్థానంలోకి రైతువుద్యమం ప్రాకింది.

మలబారుకన్నా ముందే కౌలుసమస్యను గురించి కొచ్చిన్‌సంస్థానం ఒక చట్టాన్ని చేసిందనీ, ఆ చట్టం యెలా రైతులను జమీందారీ యినుపచేతుల నుండి పూర్తిగా విముక్తిచేయలేదో ఈ పుస్తకంలోనే రెండవ అధ్యాయం లో చెప్పబడింది. వరూంపటాందార్లకు నివారణ యిచ్చేలా చట్టాన్ని మార్పుచేయించను ఒక వుద్యమం అచ్చటకూడా సాగుతూవుంది. కాని యీ వుద్యమం పెద్ద ప్రజావుద్యమంగా తయారుకాక యేదో కొద్దిమంది నాయకుల వుద్యమంగా మాత్రమే వుండిపోయింది.

మలబారు రైతువుద్యమ అభివృద్ధి, చట్టాన్ని సవరించను జరిగిన మలబారు రైతుల ఆందోళనా, జెనెస్సీ విచారణకమిటీ నియామకం మొద లయినవి కొచ్చిన్ రైతుల దృష్టిని ఆకర్షించాయి. వరూంపటాందార్లకు న్యాయమైన శిస్తు యింతని నిర్ణయంజరగాలని చేసిన ఆందోళన విశాల ప్రజాసామాన్యాన్ని ఆకర్షించింది. కొచ్చిన్ రైతుసంఘం అనే సంస్థ యీ వుద్యమాన్ని సమీకరించి నడుపను స్థాపితమయింది. సంస్థానం యొక్క ముఖ్యపట్టణమైన ఎర్నాకులానికి సంస్థానంలో నలుమూలలనుండి ఒకయాత్ర నడుపబడింది. ప్రభుత్వమే వరూంపటామాదార్ల కౌలును నిర్ణ యించను ఒకబిల్లును తయారుచేసింది. మూడు సంవత్సరాలు సాగదీసిన తర్వాత యీ బిల్లు చట్టరూపాన్ని పొందింది.

వరూంపటాందారు చెల్లించుకోవలసిన శిస్తును ఈ బిల్లు యేవిధం గానూ నిర్ణయించదనేది సత్యం. బిల్లులోవున్న క్లాజు ప్రకారం ప్రస్తుతం అమలులోవున్న శిస్తురేట్లన్నీ ఖాయంచేయబడి, బిల్లు అమలులోకి వచ్చిన తర్వాత శిస్తురేటు హెచ్చించడంగాని, లేక తగ్గించడంగాని చేయరాదని వుంది. వున్నకౌలును వున్నట్లు నిర్ణయించడమనేది నటనకొరకు చెప్పడం తప్ప యింకేమికాదు. ఎందుకంటే, వారు యిచ్చుకోవలసిన విపరీతమైన కౌలు మొత్తాలు చెల్లించుకోలేక యెక్కువమంది రైతులకు తమ భూము లను వదలుకోవటం తప్ప వేరేగతిలేదు.

అయినప్పటికీ ఈ బిల్లును అమలులోకి తీసుకరావడం గొప్ప ప్రజా విజయం. యెందువల్లనంటే, వరూంపటామాదార్లు ఒకవర్గమనీ, వారి వర్గహక్కులను సంస్థాన ప్రభుత్వం రక్షించవలసి ఉందనీ బిల్లు గుర్తిం

చింది. తాము యింకొక అడుగు ముందుకెళ్ళి తమ సంస్థను సంఘటిత పరచి ఆందోళన సాగిస్తే తమ న్యాయమైన హక్కులను సాధించుకోగలం అనే ఆశను ఈ బిల్లు రైతులకు కలిగించింది.

ఈ వుద్యమంలోవున్న యింకో ప్రాముఖ్యమైన విషయమేమిటంటే ఈ వుద్యమ స్థాపకుల్లో ఒకరూ, ప్రస్తుతం సంఘాధ్యక్షులూ ఒక గాంధీ వాది (యిప్పుడు జైల్లో వున్నాడు). కార్యదర్శి కమ్యూనిస్టు.

## యుద్ధంవల్ల యేర్పడ్డ ఆర్ధిక చిక్కులకు వ్యతిరేకంగా అన్నివర్గాల కలయిక :

1940 ఎప్రిల్, మే నెలల్లో యుద్ధం ఒక కొత్తదశకు వచ్చింది. పడమటి యూరోపంతా యుద్ధరంగం కావటం, మిత్రమండలి యెడతెగని నష్టాల ననుభవించడం జరుగుతూంది. ఈ పరిస్థితి రైతువుద్యమంపై కూడా తక్షణం పనిచేసింది. మొదటి విషయం : సామ్రాజ్యవాదం జాతీయోద్యమంలోవున్న విప్లవశక్తులపై తీవ్ర నిర్బంధవిధానం మొట్టమొదట సాగించి, తర్వాత జాతీయోద్యమాన్నే దెబ్బగొట్టసాగింది. సహజంగా మలబారులో యీ నిరంకుశ హస్తం మొదట రైతుసంఘంపై బడింది. కేరళరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు, కార్యదర్శి, వాలంటీరు కమాండరు అరెస్టుచేయబడ్డారు. ఇతర రైతునాయకులు అరెస్టయిపోవడమో, లేక అరెస్టును తప్పించుకొని పనిచేయుటకు రహస్య జీవితయాత్ర చేయడమో తప్పనిసరి అయింది. రహస్య నాయకులను పట్టుకొనుటకు, రహస్య సారస్వతాన్ని వశం చేసుకొనుటకు యిండ్లు సోదాచేయటం మొదలైన రూపంలో ఎడతెగని వేట ప్రారంభ మయింది. ఇది ప్రభుత్వ దైనిక కార్యక్రమమయింది.

రైతువుద్యమంపై సాగుతున్న యీ దౌర్భాగ్య నిరంకుశ దాడికి తోడు యుద్ధంవల్ల యేర్పడ్డ ఆర్ధిక చిక్కులమూలంగా ప్రజల దీనావస్థ పెరుగుతూంది. శత్రువు తమ మార్కెట్లను స్వాధీనం చేసుకోవడంతో మిల్లుల్లో తయారయ్యే సరుకులు అమ్ముడుపోవటంలేదని మిల్లులు మూసి

 వేసి, కూలీలను మిల్లులనుండి గెంటేయడం ప్రారంభమైంది. నెల జీతా

లపై ఆధారపడి జీవిస్తున్నవారి జీవితం దుర్భరమైపోయింది. ఎందుకంటే, వారి జీవితంలో పెరుగుదల లేకపోగా వారు కొనవలసిన జీవితావసర సరుకుల ధరలు పెరిగిపోయినవి. ఇక రైతులు తాము కొనవలసిన సరకుల ధర విపరీతంగా పెరిగి, తమ వుత్పత్తి సరకుల ధర అలానేవుండడం మూలాన కఠిన జీవితం గడుపవలసివచ్చింది. దీనికితోడు అన్నివర్గాల ప్రజల దీనావస్థను అభివృద్ధిచేయడానికి, యుద్ధ చందాలవసూలు ప్రారంభ మయింది. అందువల్ల కూలీ - రైతు నాయకులు సరాసరి యుద్ధ వ్యతిరేకంగాకుండా యుద్ధంవల్ల యేర్పడ్డ యీ నూతన దౌర్భాగ్యావస్థకు వ్యతిరేకంగా చొరవతో వుద్యమాన్ని ప్రారంభించారు. ప్రజల కోర్కెలను సాధించడానికి ఒక కార్యక్రమం యివ్వబడ్డది. ఆ కార్యక్రమంలో యీ క్రింది అంశాలున్నాయి. (7)

(1) జీవితావసర సరుకుల ధరలలో వచ్చిన హెచ్చింపుప్రకారం కూలీలకు, జీతంపైన ఆధారపడి పనిచేసేవారికి, అధికధరల అలవెన్సును యివ్వాలి.

(2) అన్ని పట్టణాలలోను, పల్లెల్లోను చౌకధరలకు ధాన్యం కొట్లు స్థాపించాలి.

(3) యుద్ధచందాల వసూళ్ళలో నిర్బంధవిధానం అమలుపరుస్తున్న ఉద్యోగులపై తీవ్రచర్య తీసుకోవాలి.

(4) వ్యవసాయకుల వుత్పత్తి సరకులకు న్యాయమైన ధరలు నిర్ణయం కావాలి.

ఈ కోర్కెలను సాధించుటకును, తగిన ఆందోళన చేయుటకును, సరైనయేర్పాట్లుచేయను, ఒకకమిటీ స్థాపితమైంది. కామ్రేడ్ కె. పి. ఆర్. గోపాలన్ యీ కమిటీకి కార్యదర్శిగా యెన్నుకోబడ్డాడు. ఈ పై కోర్కెలను బలపరుస్తూ ఒక మెమోరాండంపైన ప్రజల చేవ్రాళ్లు చేయించడం ప్రారంభమైంది. ఈ కోర్కెలను ప్రజానీకంలో ప్రచారంచేయుటకు తెంపులేని సభలూ, సమావేశాలూ మలబారంతటా జరిగాయి. ట్రేడుయూనియనుకు, రైతుసంఘానికి మెంబర్లను చేర్పించడం చురుకుగాసాగింది. ఉద్యమంఒక క్రొత్తస్థాయికి వెళ్ళేలా కనిపించింది.

## 1940 సెప్టెంబరు 15 ఘటనలు :

వుద్యమం యీ స్థాయిలో వున్నప్పుడే సెప్టెంబరు ఘటనలు సంభవించాయి. చిరక్కాల్ తాలూకా కూలీ-రైతునాయకులు ఆర్థిక చిక్కులకు వ్యతిరేకంగా సాగుతున్న వుద్యమం ఒక నూతన స్థాయికి అభివృద్ధి చెందిందని సమీక్షచేసి, తగిన కార్యక్రమం యివ్వడం అవసరమని తలచారు. అందువల్ల సెప్టెంబరు 15వ తారీకున తాలూకా రైతుమహాసభ జరుపనిశ్చయించుకొన్నారు. కాన్ఫరెన్సు కన్ననూరుకు సమీపంలోవున్న "కీచేరి" అనే గ్రామంలో జరుపనిశ్చయించుకొన్నారు.

ఇలా మహాసభ యేర్పాట్లు జరుగుతున్నప్పుడే, బ్రిటిషు సామ్రాజ్యవాదులు ప్రకటించిన ఆగష్టుప్రకటనకు అసమ్మతిజరుపను కేరళా కాంగ్రెసు సంఘం రాష్ట్రమంతా సభలు జరుపవలెనని అదే తారీకు నిర్ణయించింది.
ఈ సభలకు రెండురోజులు ముందుగా, మలబారు జిల్లాకలెక్టరు అసమ్మతి సభలు జరుపరాదంటూ 144 సెక్షనుక్రింద సభల నిషేధించాడు. 'కీచేరి'లో జరుగనున్న రైతుమహాసభకు యీ వుత్తరువు వర్తించదు గావున ప్రయత్నాలు జరిగిపోతున్నాయి. అయినా స్థానిక మేజస్ట్రీటు రైతుమహాసభను జరుపరాదంటూ వుత్తరువు చేశాడు.

చాలా ప్రదేశాల్లో సభలు ఆపివేయబడ్డాయి. ప్రభుత్వ వుత్తరువులు ధిక్కరించవద్దని ప్రజలను హెచ్చరిస్తూ గాంధీవాదులు ప్రకటన చేశారు. కాని యీ వుత్తరువు పదిహేను పదహారు ప్రదేశాల్లో ధిక్కరించబడి యించుమించు 200 మంది కాంగ్రెసువారు అరెస్టుకాబడ్డారు. సభానిర్వాహకులకు, ఉద్యోగులకు మధ్యా దెబ్బలాటలు చెలరేగాయి. కాని ఈ ఘర్షణలు మూడు ప్రదేశాల్లో తీవ్ర స్వరూపం దాల్చాయి.

ఇందులో మొట్టమొదటిది కీచేరీ గ్రామ సమీపంలోనున్న మొరాజా అనే గ్రామంలో సంభవించింది, కీచేరీలో మహాసభను నిషేధించారు గావున సభానిర్వాహకులు సభను మొరాజా గ్రామంలో యేర్పాటుచేశారు. కాని ప్రభుత్వ వుద్యోగులు అచ్చటకూడా ప్రవేశించి సభను నిషేధించారు. ఇంచుమించు 2000 మంది రైతులు, రైతువాలంటీర్లు అచ్చట సమావేశమయ్యారు. నిషేధాన్ని ధిక్కరించుటకు సంసిద్ధమయ్యారు. ప్రజలకూ

పోలీసులకూ మధ్య ఘర్షణ రావడం, ఒక పోలీసు ఇనస్పెక్టరు, యిద్దరు కాని స్టేబుల్సు చావడం జరిగింది. ఈ ఘర్షణే కామ్రేడ్ కె. పి.ఆర్. గోపాలన్‌ను మొదటిముద్దాయిగాఉన్న మొరాజా దొమ్మీ కేసుగా పరిణమించింది.

రెండవ ఘటన కొత్తాయం తాలూకా మట్టనూరు గ్రామంలో జరిగింది. ఆ ప్రదేశంలోనున్న రైతుసంఘ ఆర్గనైజర్లు, వాలంటీర్లంతా అచ్చట సమావేశమయ్యారు. అధికార్ల వుత్తరువు ధిక్కరించబడింది. ఘర్షణ తటస్థించడం, ఫలితం ఒక పోలీసు చంపబడ్డం జరిగింది.

మూడవది కొట్టాయం తాలూకా "తెల్లిచెరీ" పట్టణంలో జరిగింది. ప్రజలకూ, పోలీసులకూ ఘర్షణ యేర్పడింది. కాని యిచ్చట పోలీసులుగాక ప్రజలే బాధలు అనుభవించవలసి వచ్చింది. అబ్దుల్లా, చాతుకుట్టీ అనే యిద్దరు వాలంటీర్లు కాల్చి చంపబడ్డారు.

## రైతులు నిర్బంధాన్నెదుర్కొన్నారు

ఈ ఘటనలు సహజంగా తీవ్రనిర్బంధ విధానానికి దారితీశాయి. సభలుగాని, నిజానికి అసమ్మతి యే రూపంలో గూడా తెలియచేయడం సాధ్యంకాకుండా నిషేధవుత్తరువులు అమలులోకొచ్చాయి. పోలీసులు - యం. యస్. పి. (మలబారు స్పెషల్ పోలీసు - యించుమించు మిలిటరీ రకం) చరకాల్ - కొత్తాయం తాలూకాలలో భయంకర పరిపాలనను ప్రారంభించారు. అరెస్టులు, యిండ్లసోదాలు, అమాయక ప్రజలను కొట్టడం, రెచ్చగొట్టడం మొదలయిన నిరంకుశకార్యాలు వారి నిత్యకార్యక్రమమయ్యాయి. కొంతమంది ఆఫీసర్లు, వారి గులాములు దీన్ని అవకాశంగా తీసుకొని అమాయక ప్రజలనుండి డబ్బు గుంజడం పరిపాటి అయిపోయింది. ఇంచుమించు కిసాన్‌సభానాయకులు, స్థానిక నాయకులు అందరూ సెప్టెంబరు 15 కు ముందో, లేక ఒకటిరెండు వారాల తర్వాతో అరెస్టు చేయబడ్డారు.

ఈ నిరంకుశ భయంకర నిర్బంధవిధానగాధలు గాంధీవాదులను సహితం కదల్చివేశాయి. సెప్టెంబరు 15 వ తారీకు ఘటనలకు బాధ్యులను ఖండిస్తూ గాంధీవాదుల పత్రిక అయిన "మాతృభూమి" ఈ ఘటనలను బహిరంగవిచారణ జరుపమని కోరింది. కాంగ్రెసు వర్కింగుకమిటీ

సెప్టెంబరు 15 వుత్తరువుల ధిక్కారణనను ఖండించి, దీనికి బాధ్యులు అతి వాద కాంగ్రెసువారని నిర్ణయిస్తూ అందువల్ల రాష్ట్ర కాంగ్రెసు కమిటీని రద్దుచేసి, ఒక అడ్‌హాక్ కమిటీని దానిస్థానే నెలకొల్పింది. కాని ఈ అడ్‌హాక్ కమిటీ మొట్టమొదటి మీటింగులోని తీర్మానాల్లో ఒక తీర్మానం, కొత్తాయం-చరకాల్ తాలూకాలనుండి పోలీసు అరాచక చర్యలను గురించి వస్తున్న రిపోర్టులు బహిరంగవిచారణ పెట్టి విచారించాలని కోరుతూ తీర్మానించింది. జిల్లాకలెక్టరు అసలు విచారణే నిషేధించాడు గావున ఈ కమిటీ తీర్మానించుకొన్నట్లు విచారణ జరుపలేకపోయింది.

ఇలా రైతులు కాంగ్రెసు రక్షణనుండి దూరంచేయబడ్డా, వారి నాయకులను యెక్కువమందిని ప్రభుత్వం వారినుండి దూరంచేసినా, రైతులు ధైర్యాన్ని వదలలేదు. వారు వత్తిడికి లొంగిపోలేదు. వారు కొత్త యెత్తుగడలతో వారి సంఘాన్ని చెడకుండా కాపాడుకున్నారు. అప్పటికి యింకా అరెస్టుకాకుండా రహస్యంగా పనిచేస్తూన్న తమ నాయకులను రక్షించను గొప్ప జాగ్రత్త తీసుకొని పనిచేశారు. కామ్రేడ్ కె. పి. ఆర్. గోపాలన్‌గారిని 8 మాసాలపాటు దాచివుంచి. తాలూకాలో రైతులకు అప్పటికప్పుడు తగిన సలహాలిస్తూ, రైతుసంఘాన్ని చెడకుండా కాపాడటం చూచి దేశమంతా ఆశ్చర్యపడిపోయింది. అధికార్లకు కామ్రేడ్ కె. పి. ఆర్. గోపాలన్‌లాంటి నాయకులను పట్టిస్తే అమలులోవున్న ప్రభుత్వ నిర్బంధం, దాడి ఆగిపోతుందని రైతులెరుగుదురు. కాని తమను తాము రక్షించుకొని అలాంటి సీచానికొడిగట్టేదానికన్నా ఏమైనాసరే తమ సంస్థను చెడకుండా అభివృద్ధిచేయుటకు సంసిద్ధమయ్యారు రైతులు.

ఈ దశలో రైతులు, రైతుబిడ్డలూ, స్త్రీలూ ప్రదర్శించిన ధైర్య సాహసాలవలననే ఆనాడు మలబారు సోషలిస్టులు 1940 నాటికల్లా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన్ని అంగీకరించి, దానికి అర్హమైన రహస్యయంత్రాన్ని - కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకత్వాన్ని ధిక్కరించి, మరీ నిర్మించ గలిగారు. అలా శక్తివంతమైన రహస్యపార్టీని స్థాపించడమే గాకుండా, వారు రహస్యపార్టీని పునాదిగాపెట్టుకొని, కిసాను వర్కర్లను, రైతులను నిస్పృహ, నిరాశలనుండి కాపాడగలిగారు. రహస్య సార

 స్వతంద్వారా, కొద్దిమందితోకూడిన దళాలైనప్పటికీ సంఘటితపరచబడ్డ

చురుకైన రైతువర్కర్లద్వారా, అప్పుడప్పుడు రహస్యనాయకులు టూర్లు వేసుకొని తిరగడంమూలాన, అంతకుముందునుండీ పనిచేస్తున్న కిసాన్ వాలంటీర్లను, ఆర్గనైజర్లను దగ్గర సంబంధంలో వుంచుకొని ఉద్యమాన్ని కాపాడగలిగారు. కిసాను వుద్యమానికి కొత్తనాయకులు, ఆర్గనైజర్లు ముందుకు రావడం, పాతవారు యీ నిరంకుశ క్రూర నిర్బంధవిధానంలో ఆరితేరడం. కిసాను వుద్యమ నాయకత్వం ఒక బ్రహ్మాండమైన మార్పును పొందింది. వుత్తర మలబారులోని రైతులు తీవ్రమైన పరీక్షలకు గురి అయ్యారు అయినా యీ పరీక్షల్లో దెబ్బతినకపోవడమేగాకుండా మంచి అనుభవంతో బలపడి కడతేరారు.

## జమీందారుల దాడి

ఉత్తర మలబారులో రైతు వుద్యమానికి వ్యతిరేకంగా సాగిన తీవ్ర నిర్బంధవిధానంవల్ల యిక రైతులను తమ యిష్టమువచ్చినట్లు ఆడించవచ్చని జమీందార్లు తలచారు. 1938, 39, 40 సం॥లలో కిసాన్‌వుద్యమం బలంగా వున్నది. అప్పుడు రైతుల ఐక్య ఆందోళనకు జమీందార్లు లొంగవలసివచ్చింది. రైతులు తమ ప్రియతమ నాయకులచే నడిపించబడినంత కాలమూ, తమ సంస్థ సంఘటితమై వుండినంతకాలమూ, భూస్వాముల నిరంకుశ నిర్బంధవిధానాలను సహించేవారుగారు. కాని ఇప్పుడో? వారి ప్రియమైన నాయకులు జైళ్ళలోవుండడంమూలాన, వారి సంస్థ సమావేశ వాక్స్వాతంత్ర్యాలు కోలుపోయిందిగాన, రైతులు సాధించిన హక్కులను తిరిగి జమీందార్లు గుంజుకోగలమనుకున్నారు.

కాని త్వరలోనే జమీందార్లు తాము పొరపాటుపడ్డామని గ్రహించారు. రైతులు తమ నాయకులు జైళ్ళలో వున్నప్పటికీ, తమకు పౌరసత్వ హక్కులు లేకపోయినప్పటికీ, సంఘటితంగా తమసంస్థను కాపాడుకోగలిగారు. యెప్పుడైతే జమీందార్లు నిర్బంధవిధానం ప్రయోగించారో తక్షణం రైతులు తిరిగి దెబ్బకొట్టారు.

రైతులకు వ్యతిరేకంగా మొట్టమొదట ఆయుధం యెత్తింది కాల్లియట్ నంబియారు. రైతులు తిరిగి రెన్యూయల్ రుసుమును చెల్లించుకోవాలని కోరాడు. ఈ రుసుములు 1938,39,40 సంవత్సరాలలో రైతు 

వుద్యమం బలంగా యున్నప్పుడు రద్దుచేయబడ్డాయి ఇప్పుడు రుసుము వసూలుచేస్తే రైతులనుండి గొప్ప మొత్తాలుగా డబ్బువస్తుందని, అందులో కొంత యుద్ధఫండుకు యివ్వవచ్చని తలచాడు. ఈవిధంగా ఆఫీసర్ల యొక్క సహాయమును సంపాదించి రైతులు ఎదురుతిరిగినట్లయితే అణచి వేయవచ్చనుకున్నాడు. కాని కిసానుసభ యీసమస్యను వెంటనే తీసుకొని రైతులమధ్య నిర్మాణయుతంగా ఎడతెగని ప్రచారంచేసి వారికి ధైర్యాన్ని, నమ్మకాన్ని గలిగించింది. దీనిఫలితంగా జమీందారు రెన్యూయల్ ఫీజు అడిగినప్పుడు రైతులు వ్యక్తిగతంగా మేమిచ్చుకోలేమని జవాబిచ్చారు. అందువల్ల రైతులు యీ విషయంలో గట్టిగా నిలబడియున్నారని, వారికోర్కెను అంగీకరించనట్లయితే వారివద్దనుండి డబ్బుగుంజుకోవడం కొరకు యెక్కువ ఖర్చుపెట్టవలసియుంటుందని జమీందారు గ్రహించాడు. కావున ఇతడు డబ్బు వసూలుచేయడం మానేశాడు.

రెండవ జన్మి కరక్కాటిదాతిల్ నాయనార్. ఇతనికోర్కె 1938, 39, 40 సం॥లలో ఇచ్చిన ముజరాలు తిరిగి ఇచ్చివేయమని. అలా జరగకపోతే అడవిభూముల (వీటిని పునాం భూములంటారు) వ్యవసాయము సాగనివ్వనని బెదరించాడు.

ఇలా వేలకొలది కుటుంబాలు 2, 3 సంవత్సరాలముందు సాధించిన హక్కులు పోగొట్టుకొని, భూములను పోగొట్టుకొని, ఆకలికి మాడదమా? అనే సమస్యకు గురియైనవి. కిసానుసంఘం యీ సమస్యనుగూడ వెంటనే తీసుకొని పరిష్కారముకొరకు రైతులను సమీకరించింది. జమీందారు నిషేధించిన భూమిని సాగుచేయాలని రైతులు తీర్మానించుకున్నారు. జమీందారు పోలీసుయొక్క, యం. యస్. పి. యొక్క సహాయంతో నిషేధాన్ని అమలుపరచవచ్చునుకున్నాడు. రైతులు తమసంఘంద్వారా ఎంతటి నిర్బంధవిధానాన్ని అయినా తట్టుకొని ఐక్యంగా నిలబడగల్గినంత సంఘటితపడ్డారనేది జమీందార్లు తెలుసుకున్నారు. అందువల్ల నిర్బంధ విధానం లేకుండా సమాధానపద్ధతికి తయారయ్యాడు జమీందారు. రైతుల్లో ఒకభాగానికి కొన్ని మినహాయింపులిచ్చి రైతుల్లో చీలికలు తీసుకొని రావచ్చని ఆశించాడు. అందుకనే రైతుల్లో వెనుకయున్న ఒకబడి

భాగాన్ని లొంగదీసుకొని రాజీపడమని సలహాయిచ్చాడు. లొంగిపోయిన వారిలో కొందరు స్థానిక రైతునాయకులుగూడ యున్నారు. జన్మి అవలంబించిన యీ సమాధానపద్ధతిని వ్యతిరేకించడంవల్ల రైతుసంఘాన్ని విచ్ఛిన్నంచేసి సరాసరి ఒకభాగం రైతుల్ని జమీందారుచేతుల్లో పెట్టినవారము అవుతామని వర్గచైతన్యంకల్గిన రైతులు గ్రహించారు. కావుననే ఈ సమాధాన పద్ధతికి వారంగీకరించారు. కాని యీమాత్రమైనా జమీందారు లొంగివచ్చి కొన్ని మినహాయింపులు ఇచ్చాడంటే అది రైతుసంఘ ఐక్యబలం వల్లనే అతడు చేయవలసివచ్చిందనే సత్యాన్ని తీవ్రంగా రైతులమధ్య ప్రచారంచేశారు ఈ ప్రచార ఫలితంగా నూతన కేడరు లభించడం, నాయకత్వంలోని వూగిసలాటరకం తరిమివేయబడి నూతన విప్లవ నాయకత్వంపైకి రావడం, సంభవించింది.

ఈ జన్మియొక్క దాడిఫలితాన్ని పరీక్షిస్తూ అదేరకమైన యెత్తులతో తమ రైతులపైకూడ దాడి సాగించవచ్చని కనిపెట్టుక కూర్చున్న చుట్టుప్రక్కల జన్మిలకు ఇదిఒక గొప్పగుణపాఠమైంది. పునాంభూములను (అడవి బంజరు) వ్యవసాయానికి యివ్వడం మంచిదని వీరు నిర్ణయించుకొన్నారు. ఇలా ఒకఫిర్కాలో జన్మిలు సాగించిన సంఘటితమైనదాడిని ఇనుమడించిన సంఘటితశక్తితో త్రిప్పికొట్టి విజయాన్ని సాధించారు. అందువల్ల యీ ఫిర్కారైతులు యీనాటి మలబారు రైతువుద్యమానికి అగ్రగాములయ్యారు.

## కయ్యూరు ఉదంతం

ఉద్యమం ఈ స్థాయిలో వున్నప్పుడే ప్రసిద్ధమైన కయ్యూరు ఘటన సంభవించింది. సౌత్‌కనరా జిల్లాలో కాసరగోడుకు సబ్‌తాలూకా అయిన హోస్‌దుర్గ్ తాలూకాలో కయ్యూరు అనేది ఒకగ్రామం. ఉత్తర మలబారులో వున్న చిరక్కాల్‌తాలూకాకు సమీపంలో వుందిగాబట్టి, యెక్కువ మంది మలయాళం మాట్లాడే ప్రజలున్నారుగాబట్టి, మలబారులో యెలాంటి ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక పరిస్థితులున్నాయో అవే యిక్కడా వున్నాయి. కాని ప్రభుత్వ కార్యనిర్వాహణ విషయంలో యిది సౌత్‌కనారాలో చేర్చ

బడింది. అందువల్ల మలబారులో అమలులోవున్న టెనెన్సీచట్టం ఈ ప్రదేశానికి అన్వర్తించదు.

సౌత్ కనరా జిల్లాలో ఉన్న ఈ ప్రాంతంలో రైతువారీపద్ధతి అమలులో వున్నప్పటికి, నిజానికి రైతులు జన్మీల చేతుల్లో నానాహింసలకు గురి అవుతున్నారు. ఇతర ప్రదేశాల్లోవలెనే యిచ్చటగూడా రైతువారీ పద్ధతిక్రింద చాలామంది సొంతసాగుచేసే భూస్వాములున్నారు. ఇలా కాకుండా మలబారులో వ్యవసాయకులుగాని భూస్వాములు రైతులనుండి అధికశిస్తులు గుంజుతూవుంటారు. ఈ ప్రదేశం పేరుకు రైతువారీ పద్ధతి క్రిందవున్నా ఆచరణలో జమీందారీ భూమి పద్ధతిక్రింద నలుగుతున్న ప్రదేశం యిది. దీనిఫలితంగా భూమినంతా ఆక్రమించుకొనివున్న కొద్దిమంది జన్మీలు వ్యవసాయకులుగా తలచబడ్డారు. కావున 1930 టెనెన్సీ చట్టంవల్ల యిచ్చట రైతులకు యేమీ లాభంరాలేదు. రైతులను భూమి నుండి తొలగించుటకు, శిస్తు యిష్టమొచ్చినట్లు హెచ్చించుటకు జన్మీలకున్న హక్కులు యే విధంగాను ఆటంకపరచబడలేదు. 1930 కి ముందు మలబారులో తమ సోదర జమీందార్లు యెలా ప్రవర్తిస్తుండిరో అలాగే యిచ్చట జన్మీలు ప్రవర్తించవచ్చును.

ఈ ప్రదేశంలో కూడా మలబారు 1930 చట్టమును అమలుపరచమనేది కిసాన్ సభయొక్క ముఖ్యడిమాండు. ఈ పునాదులపైనే 1938-39 లో కాంగ్రెసు-రైతు వుద్యమాలు అభివృద్ధి అయ్యాయి. ఆర్గనైజేషన్ విషయంలో చరకాల్-కొత్తాయం తాలూకాల తర్వాత హోసదుర్గ తాలూకా వస్తుంది. చట్టప్రకారం జన్మీలు యిష్టమొచ్చినట్లు ప్రవర్తించ వీలున్నా, రైతువుద్యమం సాగించిన బలకరమైన పోరాటాలకు తలయొగ్గి, మలబారు రైతులు చట్టంప్రకారం సాధించిన హక్కులూ, మినహాయింపులూ యిచ్చటకూడా రైతుల కివ్వవలసివచ్చింది. నిజానికి మలబారు రైతులకూ, యిచ్చటి రైతులకూ వున్న భేదం రైతుల ఐక్య పోరాటంవల్ల మాయమైపోయింది.

1940 సెప్టెంబరు 15 తర్వాత మలబారు జన్మీలవలెనే యిచ్చటివారుకూడా యిదివరకు యిచ్చివున్న మినహాయింపులు తిరిగి గుంజుకో

 చూచారు. రైతులు సాగుచేసి పెంచిన పైర్లను, భూమిని యితరుల కిచ్చా

మనే నెపంతో జన్మీలు ఆక్రమించి మహసూలుచేయ మొదలెట్టారు. కిసాన్ సభ ఈ ఆటను సాగనివ్వకుండా పనిచేసింది. పంట అదునుకువచ్చిన వెంటనే కిసాన్‌సభా వాలంటీర్లు రైతులకు తోడ్పడి పంటను మహసూలు అయ్యేలా చూడడం, జన్మీల మనుషుల చేతుల్లోనుండి పంటను రక్షించను పంటభూములను కాపలా కాయడం మొదలైన పనులు చేశారు. ఇది 1940 ఫిబ్రవరి నెలలో జరిగింది. (8)

ఇది నిర్బంధవిధానానికి దారితీసింది రైతునాయకులను అరెస్టుచేయ డానికి, రైతులను క్రూరంగా కొట్టించడానికి పోలీసుల పూర్తి సహాయాన్ని పొందారు. రైతులు వాలంటీర్ల సహాయంతోచేసిన మహసూళ్ళను నేరాలుగా తీసుకొని పోలీసులు కేసులు బనాయించారు. ఇలాంటి ఒక కేసు సందర్భంలో విచారణ జరుగుతున్నప్పుడే, కయ్యూరులో పోలీసులు మార్చి మూడవవారంలో ఒక వాలంటీరును తీవ్రంగా కొట్టారు. ఇలా సాగుతున్న నిర్బంధ విధానానికి వ్యతిరేకత తెలియచేయడానికీ, ప్రత్యేకంగా కయ్యూరు వాలంటీరును హింసించినందుకు అసమ్మతిని తెలుపుకోడానికీ మార్చి 28వ తారీఖున కయ్యూరులో సభజరప నిర్ణయించబడింది. రెండువందల యాభై వరకు రైతులు, వాలంటీర్లు ఊరేగింపుతో మీటింగు ప్రదేశానికి సాగిపోతున్నారు. విచారణవిషయంలో అనేకసార్లు ఆగ్రామం వచ్చివున్న పోలీసు కానిస్టేబిల్ అచ్చట కనుపించాడు. ఆందోళనా పరవశులైన ప్రజలు అతని మీదకు వెళ్ళారు. దండానికి ఎదురుతిరిగే దానికన్నా జాగ్రత్తగా తప్పు కోడానికి వుత్సవంలో కలిశాడు పోలీసు. ప్రజలతో కలిసి నినాదాలిస్తూ నడిచాడు. కాని ఎప్పుడైతే కొద్ది అవకాశం లభించిందో తక్షణం పారిపోను ప్రారంభించాడు. ప్రజలు ఉద్రేకులై అతన్ని వెంటాడారు. కోపోద్రేకులైన ప్రజలకూ, కాలికి బుద్ధిచెప్పుతున్న పోలీసుకు జరిగిన ఘర్షణలో పోలీసు అసువులను వదిలాడు.

1940 సెప్టెంబరు తర్వాత, వుత్తర మలబారులో సాగిన నిర్బంధ విధానంకంటే, తీవ్రమయిన నిర్బంధవిధానం ప్రారంభమయింది యిచ్చట. అరెస్టులు, లాఠీఛార్జీలు, యితర భయంకర పద్ధతులు, క్రూరంగా సాగిపోయాయి. ఇలాంటి క్రూరవిధానం 1921 - 22 లో దక్షిణమలబారులో తప్ప యింకేదశలోనూ మలబారు చరిత్రలో అమలుజరగలేదు. పల్లెలకు

పల్లెలు ఖాళీ అయ్యాయి. స్త్రీలు, పురుషులు, పిల్లలు, వారు వీరేంటి-ప్రజ లంతా పల్లెలువదలి అడవుల్లో తలదాచుకొనవెళ్ళారు. కాంగ్రెసు దినపత్రిక అయిన మాతృభూమి విలేఖరి ఇలాంటి ఒక గ్రామంలో యం. యస్. పి. వారు చేసిన దుర్మార్గములను వ్రాసినందుకు జమేదారుచేత కొట్టబడ్డాడు. ఇలాంటి నిర్బంధ విధానంవల్ల రైతులనుండి అధికపన్నులు గుంజ వీలు లేకపోగా అసలు వస్తున్న పన్నుకే మోసమొచ్చేలా వుందనేది జన్మీలు గ్రహించారు. అన్నిరకాల సంస్థలూ, వ్యక్తులూ యం. యస్. పి. ని తొల గించి, సాధారణ పరిస్థితులు కలిగించాలనే డిమాండు ఐక్యంగా చేశారు.

కిసాను ఉద్యమానికి ఈనాటికికూడా కోలుకోలేనంత తీవ్రమయిన దెబ్బతగిలింది. ఈ తాలూకాలో కిసాను వుద్యమాన్ని యింత నాశనకర మైన దెబ్బకొట్టింది నిరంకుశ నిర్బంధ విధానమేగాదు. నిజానికి తాలూ కాలోవున్న 60మంది రైతుసంఘ ఆర్గనైజర్లను మొట్టమొదటి దెబ్బలోనే అరెస్టుచేయడంతో రైతువుద్యమం నానా దెబ్బతింది. చరకాల్, కొత్తాయం తాలూకాల్లో యిలా గాకుండా, యెక్కువమంది రైతునాయకులు అరెస్టు నుండి తప్పుకోవడం, రైతుల్లో ధైర్యస్థైర్యాలను నిలబెట్టి రైతువుద్య మాన్ని కాపాడడం జరిగింది. కాని హోసదుర్గ తాలూకాలో స్థానిక వర్కర్లు మొదలుకొని తాలూకానాయకుల వరకు తొలిదెబ్బలోనే అరెస్టయి పోయారు.

ఇంతమాత్రాన కిసాన్ వుద్యమం ఆ తాలూకాలో తుడిచివేయ బడిం దని మాత్రం చెప్పకూడదు. నిర్బంధవిధానం అంతులేకుండా సాగుతున్నా యితర తాలూకాల్లో రైతువుద్యమం తీవ్రంగా ముందుకు సాగుతోందనేది తెలుసుకొన్నారు ఇచ్చటి రైతులు. "మన తాలూకాలో మనం యేం చేయ లేములే" అనే అనుమానం వారికున్నప్పటికీ, రైతువుద్యమం తమదనీ, దాన్ని అన్నివిధాలా బలపరచవలెననే విషయంలో యేమీ అనుమానం లేదు వారికి. ఇతరప్రదేశాలనుండి వస్తున్న రహస్యనాయకులకు రక్షణ యిచ్చు టకు భయపడ్డారు. అయినప్పటికి రహస్యనాయకులు తమకొరకు పనిచేస్తు న్నారనే నమ్మకం వారి హృదయాల్లో వుంది. ప్రజల్లో ఈ భక్తిశ్రద్ధలు వుండబట్టే తర్వాత కిసాన్‌సభను తిరిగి స్థాపించుటకు చక్కటి వీలేర్పడింది.

ఆలస్యంగానైనా, నిర్మాణయుతమైన రైతుసంఘాన్ని అభివృద్ధి చేయగలుగుతున్నారు అచ్చటి రైతుసంఘ నాయకులూ, ఆర్గనైజర్లూను.

## రైతుసంఘం నిషేధించబడింది

ఈ రాష్ట్రంలో కిసాను వుద్యమాన్ని రూపుమాపను ఆఖరిదెబ్బ కొట్ట నిశ్చయించుకొంది మద్రాసు ప్రభుత్వం. అఖిల మలబారు రైతు సంఘం, దాన్ని అనుబంధశాఖలు నిషేధించబడ్డాయంటూ ప్రకటించింది ప్రభుత్వం. ఈ నిషేధానికి కారణం కయ్యూరు ఉదంతం అని చెప్పింది. అంతేగాకుండా, కిసాన్‌వుద్యమం కమ్యూనిస్టుల చేతుల్లో వుందని ప్రకటించింది ప్రభుత్వం.

ఈ నిషేధం నిజానికి పెద్దమార్పేమీ తేలేదు. ఎందుకంటే, 1940 సెప్టెంబరునుండి రైతువుద్యమం నిర్బంధవిధానం వలన బహిరంగంగా పనిచేయలేకపోయింది. భేదమేమిటంటే, ఆచరణలో అసలు కిసానువుద్యమం అంతకు ముందునుండీ నిషేధింపబడ్డట్టే అయింది. ఆ నిషేధం యిప్పుడు చట్టసమ్మతం చేయబడింది. ఆచరణలో నిషేధంకన్నా తీవ్ర పరిస్థితుల్లో సహితం అణగిపోని రైతులు ఈ చట్టసమ్మత నిషేధానికి వంగిపోవడం అసంభవం.

## రిలీఫ్‌కమిటీలు ముందుకొచ్చాయి

ప్రభుత్వం రైతుసంఘాలను నిషేధించిన తర్వాత 10 రోజులకు మలబారులో భయ కరమైన తుపాను వచ్చి తీవ్రనష్టాన్ని కలుగచేసింది. దీనితర్వాత 15 రోజులకు పెద్దవరదలు వచ్చాయి. ఈ రెండూ తిరువాన్కూరు, కొచ్చిన్, మలబారు అంతటా నష్టాన్ని కలిగించాయి.

ఆస్తికి, మనుష్యులకు తీవ్రమైన నష్టం వాటిల్లింది. ప్రభుత్వలెక్కల ప్రకారమే ఒక్క మలబారులోనే యిందుమూలాన 160 మంది చనిపోయారు. ఇండ్లు పడిపోవడం, తోటలు, పైర్లు నాశనంకావడం; పశువులు చనిపోవడం వలన కొన్ని లక్షలరూపాయల నష్టంకలిగింది. తిరువాన్కూరు, కొచ్చిన్ సంస్థానాల్లో గూడా యిలాంటి నష్టమే సంభవించింది.

మలబారులో వున్న మూడు ప్రభుత్వాలూ, కాంగ్రెసు, ముస్లింలీగు, నష్టమును గురించి విచారణలు జరిపి, నష్టాన్ని బహిరంగపరచి నివారణకు ప్రయత్నాలు చేశారు. నివారణకు మలబారులోనే కాకుండా బొంబాయి, మద్రాసులాంటి పట్టణాలనుండి కూడా చందాలు వసూలుచేసి ఆ డబ్బును ఐచ్ఛిక పౌరసంఘాల కిచ్చి, ప్రభుత్వం చేస్తున్న సహాయానికి కొంత తోడుగా అదనపు సహాయం చేయబడ్డది.

ఇదంతా నిజమయిన రైతుల సమస్యను ముట్టుకోలేదు. రైతుల అప్పులు, శిస్తు రెమిషను మొదలయిన ప్రాముఖ్యమగు సమస్య లను ముట్టుకోటానికి సాహసించలేదు. భూమి శిస్తు విషయంలో ప్రభుత్వం యేదో కొంత చేసింది. కాని ఆమాత్రమయినా చేసేలా జన్మి లను ప్రభుత్వం వత్తిడి చేయలేదు; అప్పుల నివారణకు కూడా యేమీ చేయలేదు.

ఈ కోర్కెలు, ఇంకా యిలాంటి ఇతర సమస్యలకు ఒకస్వరూపం యిచ్చారు రహస్యంగా ఉన్న రైతువుద్యమ నాయకులు. ఇవి రైతులచే అభినందించబడ్డాయి. ఈ కోర్కెలకు వెంటనే రైతులు ఆందోళన చేయ సాగారు. ఈ కోర్కెలను బలపరచడానికి అన్ని తాలూకాల్లో యెడతెగ కుండా సభలు జరిగాయి. ఈ కోర్కెల నంగీకరించేలా చేయను, ప్రభు త్వాన్ని కదిలించను స్థానిక ఆఫీసర్ల వద్దకు యాత్రలు, ప్రదర్శనాలతో రైతులు రాయబారాలు సాగించారు. ఈ ఆందోళననుండే ఈ రిలీఫ్‌కమిటీలు స్థాపితమయ్యాయి. ఈ కమిటీలు పల్లెల్లో 'అన్నివర్గాల ప్రజలను ఆందోళనా వుద్యమంలో కేంద్రీకరించే కేంద్రకమిటీలుగా పనిచేశాయి. ఈ కమిటీలే తర్వాత తాలుకా కమిటీలుగాను, తుదకు జిల్లా కమిటీలుగాను కేంద్రీకరించ బడ్డాయి. ఈ కమిటీలు ధరలకంట్రోలు మొదలయిన ప్రజలకు సంబంధిం చిన యితరసమస్యలన్నీ తీసుకొని పనిచేశాయి. ఇలా ఈ కమిటీలు పల్లెల్లో రైతుసంఘాల వలె, పట్టణాల్లో కూలీలూ, యజమానులు మొద లైన అన్ని వర్గాల ప్రజలను ఐక్యంచేసి పనిచేశాయి. ఈ కమిటీలు ఇటీ వల తిరిగి రైతుసంఘమే కార్యరంగంలో ప్రవేశించేంతవరకూ, ఆహార కమిటీలు స్థాపనయి పని ప్రారంభించేంతవరకు, పనిచేస్తున్నాయి.

# 4. ప్రజాయుద్ధం కొరకు ప్రజా సమీకరణ

## సోవియట్ల దేశాన్ని రక్షించాలి

మలబారు రైతుసంఘం నిషేధించబడ్డ కొలదివారాలలోనే హిట్లరు సోవియట్ రష్యాపై దాడివెడలాడు. ఏ దేశంలో అయితే రైతులు భూస్వాములనుండే గాకుండా, ధనికులనుండి, అధికలాభాలగుంజే వ్యాపారస్తులనుండి, వారు వీరేంటి-అన్నిరకాల దోపిడివర్గాలనుండి విముక్తిని పొందారో ఆ దేశంపై హిట్లరు దాడిచేశాడు. వీరులైన యెర్రసైన్యాలకూ, కిరాతక నాజీసైన్యాలకు జరుగుతున్న భయంకర యుద్ధవార్తలు ప్రతిరోజూ రాసాగాయి.

ప్రపంచంలో నలుమూలలా నున్న కష్టజీవులను యీ వార్తలు ఎలా కదలించివేశాయో అలాగే మలబారు రైతులను కూడా కదలించాయి. సోషలిస్టు మాతృదేశం యొక్క విధికృత్యాన్ని గురించి గల్గిన ఆదుర్దాయే కాకుండా, సోషలిస్టు రాజ్యాన్ని రక్షించుచున్న సోవియట్ సైనికుల వీరోచిత యుద్ధనైపుణ్యం వల్లనూ, గెరిల్లాయోధుల సాహస చర్యలవల్లనూ, సోవియట్ స్త్రీలు, పురుషులు, పిల్లలుచేస్తున్న త్యాగాలవల్లనూ, సాముదాయక రంగంలో రైతులు, కర్మాగారాల్లో కార్మికులు చేస్తున్న పవిత్ర త్యాగాల వల్లను, ఇన్నెందుకు, సోవియట్ ప్రజలు తమ మాతృదేశాన్ని రక్షించుకొన చేస్తున్న పవిత్రత్యాగాల వల్లను మలబారు ప్రజలు ఉద్రేకులయ్యారు.

అందువల్ల సోవియట్ రష్యాతో తమకున్న సోదరత్వాన్ని ప్రకటించడానికి ప్రదర్శనాలు ప్రారంభమయ్యాయి. ట్రేడ్‌యూనియన్లు, అనేక ప్రదేశాల్లో వ్యాపంలోవున్న పఠనాలయాలు, క్లబ్బులు, రిలీఫ్ కమిటీలు, సోవియట్ యూనియన్‌ను బలపరచే వ్యక్తులు మొదలయినవారంతా యీవుద్యమంలో చొరవతో భాగస్వాములయ్యారు. సోవియట్ ప్రభుత్వం యెడల, యెర్రసైన్యాల వీరపోరాటాల యెడల తమకున్న సుహృద్భావాన్ని తెలియచేసే తీర్మానాలు ప్యాసుచేయను సభలూ, సమావేశాలు జరిగాయి.

సోవియట్ రష్యాలో జీవితాభివృద్ధిని గురించి తెలియచేసే కరపత్రాలు, చిన్న చిన్న పుస్తకాలు ప్రకటించబడడం ప్రారంభమైంది. ఈ కార్య కలాపాలన్నీ తుదకు సంఘటిత స్వరూపం దాల్చి, నిర్మాణయుతంగా పని జరుగుటకు సోవియట్ సహాయసంఘాలు ఏర్పరచబడ్డాయి. ఈ సంఘాలు కేవలం తీర్మానాలద్వారా తమ సోదరాభిమానాన్ని ప్రకటించడమేగాకుండా సోవియట్ సహాయనిధిని వసూలుచేయడం ప్రారంభించాయి.

ఈ వుద్యమంలో మలబారులోవున్న రైతులు గొప్పగాపాల్గొన్నారు. వారి సంస్థ నిషేధంలో వుంది కావున వారు వారి సంస్థద్వారా యిదంతా చేయలేకపోయారు నిర్బంధవిధానంవల్ల పల్లెల్లో ఃహితం కొన్ని ప్రదేశాల్లో సంఘాలుగాని, వ్యక్తులుగాని సభలు జరుపలేకపోయారు. (ఒకటి రెండు ప్రదేశాల్లో సోవియట్ సహాయసభలు నిషేధించబడ్డాయి కూడా) కాని యిలాంటి అడ్డంకులను రైతులు జయించి 50 మందినుండి 100 మంది వరకు సమావేశమై గెరిల్లా సభలలాంటివి జరిపారు. పోలీసులను తప్పించు కొని అనుకొన్న ప్రదేశానికి వ్యక్తులుగానో, లేక చిన్న దళాలుగానో సభ లకు హాజరయ్యేవారు. ఒకరో యిద్దరో కార్యకర్తలు సోవియటు రష్యాను గురించి గంటో, అరగంటో విపులీకరించిన తర్వాత ప్రజలు తమ అను మానాలను పోగొట్టుకొనడానికి ప్రశ్నలు అడగడం, తర్వాత సభను పూర్తి చేయడం జరుగుతుండేది.

ఎచ్చటయితే ఆర్గనైజేషను బలంగావుందో అచ్చట యీ గ్రూపు మీటింగు విధానంద్వారా సోవియటు రష్యాను గురించి ప్రజలకు తెలియచేసే వారు. ఒక కామ్రేడు టీ షాపువద్ద కూర్చొనో, లేక ప్రజలుచేరే రచ్చల వద్దో చేరి దినపత్రికలు చదివి వార్తలు విపులంగా తెలియచేసేవారు. దిన పత్రికలు యిస్తున్న తప్పుడుమార్గాన్ని, కొంతమంది సోవియటు విరో ధులు వుద్దేశపూర్వకంగా చేస్తున్న తప్పుడు ప్రచారాన్ని, పుకార్లను యెదు ర్కొని నిజమైనవార్తలను ప్రజలకు అందించేవారు. దీనివల్ల ఫలితం యేమిటి ? హిట్లరు డాంబికంగా తన విజయాలనుగురించి డంభాలుకొడు తున్నప్పుడు, స్థానిక సోవియటు విరోధులు "ఇంకేమి రష్యాలే, యెగిరి పోయింది" అని పుకార్లు వ్యాపింపచేస్తున్నప్పుడు, విద్యావంతులనుకొన్న వారంతా దేశంమొత్తంమీద "హిట్లరు జయించ శక్యంకాని మానవా

తీతుడు" అని అనుకొంటున్నప్పుడు, అవిద్యాపరులు, అనాగరికులు అయిన యిచ్చటి ప్రజలకు, ఎర్రసైన్యాలు, స్టాలిన్‌లు హిట్లరుకు అతని అనుచరులకు గోరీ త్రవ్వుచున్నారనేది తెలుసుకొన్నారు. అంతేగాకుండా హిట్లరుకు గోరీ కట్టడమంటే, నిజానికి ప్రపంచ సామ్రాజ్యవాదాన్ని చావుదెబ్బ గొట్టడమనేదికూడా గ్రహించారువారు.

## మాతృదేశాన్ని రక్షించాలి

ఇదంతా జరుగుతున్నప్పటికీ మొత్తంమీద యుద్ధవిషయంలో రైతుల దృక్పథం మారలేదు బ్రిటిషు ప్రభుత్వ యుద్ధ ప్రయత్నాలన్నీ తన సామ్రాజ్యాన్ని కాపాడుకొనుటకు, అభివృద్ధి చేసుకొనుటకు జరుగుతున్న యుద్ధప్రయత్నాలే అనుకొనేవారు రైతులు. అందువల్ల భారతదేశంలో యుద్ధ ప్రయత్నాలయెడల వ్యతిరేకత మునుపటివలె సాగిపోతూనే వుంది. అయితే అప్పటికీ, ఇప్పటికీ ఒక్క భేదం ఉన్నది. భారతదేశం స్వతంత్రదేశమని ప్రకటించబడ్డా, స్వతంత్ర ప్రభుత్వస్థాపన జరిగినా, ప్రపంచయుద్ధంలో తాటస్థ్యంగా వుండడమనేది మునుపటి ధోరణి. కాని యిప్పుడు దానికిబదులు బ్రిటిషు ప్రభుత్వ ప్రాబల్యం భారతదేశంలో యెంతకాలం అయితే వుంటుందో అంతకాలం యుద్ధప్రయత్నాలకు వ్యతిరేకంగా వుండడం అనేది కొత్త దృక్పథం. ఇదిమాత్రమే యీనాటికి వచ్చిన నూతన దృక్పథం.

అంతర్జాతీయంగాను, జాతీయంగాను వచ్చిన మార్పులు మొత్తంమీద యుద్ధంయెడల మన దృక్పథంలో పెద్దమార్పును తెచ్చాయి. రష్యా బ్రిటన్ సంధి అట్లాంటిక్కుచార్టరు, మాస్కో కాన్ఫరెన్సు, ప్రసిద్ధ రాజకీయవేత్తలైన స్టాలిన్, మాలటోవ్, లిట్వినోవ్, మెయిస్కీ మొదలయినవారు సోవియట్ యుద్ధనీతినిగురించి చేసిన ప్రకటనలు మొదలైనవి. సోవియటుభూమి యుద్ధంలోకి రావడమనేది, ప్రపంచ ప్రజలు తమలో తాము ఐక్యమై, సోవియటు ప్రజలతోకలసి యీ యుద్ధాన్ని జయించడం ద్వారా అన్నిదేశాల స్వాతంత్ర్యాన్ని సాధించడానికి గొప్ప అవకాశం కలిగించిందనే సత్యాన్ని గ్రహించారు. జపాన్ అమెరికా, బ్రిటన్‌లకు

వ్యతిరేకంగా యుద్ధం ప్రకటించి శరవేగంతో దూర ప్రాచ్యంలో జొర బడడం భారతదేశాన్నికూడా ఫాసిస్టు యుద్ధ అఖాతంలోకి తెచ్చింది.

కాంగ్రెసునాయకుల విడుదల, ఫాసిస్టు దాడికి వ్యతిరేకంగా వారిచ్చిన నిస్సందేహకరమైన ప్రకటనలు, జాతీయ రక్షణకు, జాతీయ ప్రభుత్వం కావాలని, జాతీయ ప్రభుత్వ స్థాపనకు జాతీయైక్యత కావాలని, హిందూదేశ కమ్యూనిస్టుపార్టీ యిచ్చిన నూతన పంధా, జనరల్ జంగ్-కై షేక్ హిందూదేశం రావటం మొదలైనవాటివల్ల ఈ యుద్ధంలో చేరడం, ఈ యుద్ధానికి సహాయంచేయడం అంటే, సోవియటురష్యా రక్షణకుగాదని తమ మాతృదేశాన్ని రక్షించుకొనుటకు అవసరమైన ఐక్యత కావాలనేది నేటి కార్యక్రమమని ఖచ్చితంగా తెలియవచ్చింది. జాతీయ ఐక్యత, జాతీయరక్షణలు జాతీయస్వాతంత్ర్యమునకు మార్గమనేది గుర్తించబడింది.

1942 జనవరిలో పాట్నాలో జరిగిన అఖిలభారత విద్యార్థి మహాసభ తీర్మానం, ఫిబ్రవరిలో నాగపూరులో జరిగిన అఖిల భారత కిసాన్ కౌన్సిలు తీర్మానం, అఖిల భారత కాంగ్రెసుకమిటీ మీటింగుల్లోనూ, ట్రేడ్ యూనియను కాంగ్రెసు మీటింగుల్లోనూ కమ్యూనిస్టు నాయకులు ఇచ్చిన ఉపన్యాసాలు మొదలైనవి, 1941 లో యుద్ధంలోవచ్చిన మార్పును స్పష్టీకరించి, మలబారు రైతువుద్యమం యుద్ధంలో యే దృక్పథం అనుసరించాలో నిర్ణయించుకోడానికి సహాయపడ్డాయి.

క్లుప్తంగా చెప్పాలంటే యిలా చెప్పవచ్చు.

(1) నాజీ జర్మనీ సోవియట్ భూమిపై యుద్ధానికి తలపడడంతో యుద్ధం ప్రజాయుద్ధమైంది. ఎక్కడైనా యిది ప్రజాయుద్ధంగానే జయం పొందగలదు. ఏ ప్రజలకైనా యీ యుద్ధంలో ఓడడమంటే కఠిన ఫాసిస్టు బానిత్వాన్ని పొందడమన్నమాట. దీనికి వ్యతిరేకంగా, అంటే అందరికీ సంబంధించిన ఈ యుద్ధ విజయంకొరకు తమలోతాము ఐక్యమై ప్రపంచ ప్రజలతో చేతులుకల్పి జాతీయరక్షణను బలపరచడమనేది తమను తాము బలపర్చుకోవడమేగాకుండా, తమ స్వాతంత్ర్యంకొరకు ముందుకెళ్ళడమౌతుంది. యుద్ధ విజయంద్వారా జాతీయ స్వాతంత్ర్యం, యుద్ధ వోటమిద్వారా ఫాసిస్టు బానిసత్వం వస్తాయి.

(2) జపాను దూరప్రాచ్యంలో దెబ్బకొట్టడంతో యుద్ధం సూటిగా భారతదేశరక్షణ యుద్ధమయింది. (9)

(3) ఈ కారణాలవల్ల ఫాసిస్టులకు వ్యతిరేకంగా దేశరక్షణకొరకు భారత ప్రజలు సంఘటితపడాలి.

(4) ఇలాంటి దేశవ్యాపిత సమీకరణ శక్తివంతంగా జరగాలీ అంటే భారతదేశం స్వతంత్రదేశమని ప్రకటించబడ్డప్పుడు, తాత్కాలిక జాతీయప్రభుత్వం స్థాపించినప్పుడు యిది సాధ్యమవుతుంది.

(5) దేశరక్షణకొరకు అవసరమయిన జాతీయప్రభుత్వ స్థాపనకు బ్రిటిషు ప్రభుత్వాన్ని వంచాలీ అంటే, అన్నిశక్తులనూ ఐక్యం చేయగల్గిగిన కాంగ్రెసు - ముస్లింలీగులు ఐక్యం గావాలి.

(6) ఇలాంటి ఐక్యత సాధించాలీ అంటే, హిందూదేశంలోని జాతుల స్వయంనిర్ణయ సూత్రాన్ని అంగీకరించాలి.

ఈ ముఖ్యమయిన భావాలకు దేశవ్యాపితంగా ప్రజల్లో ప్రచారం జరిగింది. దేశం మొత్తంమీద, జపాన్ వ్యతిరేక ప్రదర్శనాలు, పుత్సవాలు, సమావేశాలు జరిగాయి. ఆటలు, పాటలు, నృత్యాలు, చిత్రవిచిత్ర వేషాలు, అది యిదేంటి - అన్నిరకాల చిత్రకళలూ ప్రజలకు యీ భావాలను తల కెక్కించను ప్రదర్శించబడ్డాయి,

ఈ ప్రచారం, ఆందోళనా వుద్యమంనుండే జపాన్ వ్యతిరేక కమిటీలు, వాలెంటీర్లు వచ్చారు. రైతువుద్యంతో సంబంధమున్న ప్రతి గ్రామంలో జపాను వ్యతిరేకకమిటీ స్థాపితమయింది. వాలంటీర్లు రావడం, వారికి తరిఫీదు యివ్వడం, స్త్రీలను, పిల్లలగూడా సమీకరించి జపాను ఏజంట్లను వేరుపరచి, వారి రంగును బయటపెట్టడం జరిగింది. రిలీఫ్ కమిటీలను, ధరలకంట్రోలు కమిటీలను, జాతుల స్వయంనిర్ణయ హక్కు కొరకు, జాతిరక్షణకు అవసరమైన జాతీయప్రభుత్వ స్థాపనకు జరుగుతున్న ప్రజాసమీకరణలో కలసి వుద్యమాన్ని సంఘటిత పరచారు.

అగష్టు సంఘటనలలో యితర రాష్ట్రాలలో జరిగిన విషాద ఘటనలు యిచ్చట జరగకుండా చేసింది యీ వుద్యమమే,

రాష్ట్రంలో యెక్కడా సాముదాయక జరిమానా వేయడంగాని, ప్రజలపై పోలీసులు తుపాకులు పేల్చడంగాని, జరుగలేదు. విధ్వంసక కార్యాలు చాలా అరుదుగా జరిగాయి. యితర ప్రదేశాల పోల్చిచూస్తే చాలా కొద్ది లాటీ చార్జీలు యిచ్చట జరిగాయి. జాతీయనాయకుల విడుదలకు, ముస్లింలీగుతో స్వయంనిర్ణయ హక్కును అంగీకరించి కాంగ్రెసు రాజీకి వచ్చి జాతీయ ప్రభుత్వస్థాపన చేయాలనీ, యెడతెగని ఆందోళనా, మీటింగులు జరిగాయి. జపాను వ్యతిరేక ప్రచారంవల్ల జాతీయ అయిక్యత కొరకు సాగించిన తీవ్రమయిన ప్రచారంవల్ల, జాతీయ రంగంలో క్లిష్ట పరిస్థితి వచ్చినా కేరళరాష్ట్రం అంతగా దానికి గురికాలేదు.

## కాంగ్రెసు నాయకుల విడుదల చేయాలి - రైతుసంఘంపై నిషేధం తొలగించాలి.

జాతీయ రక్షణకు, నాయకుల విడుదలకు జరుగుతున్న ఈ వుద్యమంలో భాగంగా ప్రజాసంస్థలపై నిషేధం తొలగించమనీ, పౌరసత్వ హక్కులను నిలబెట్టమనీ ఆందోళన జరిగింది. మొదటిదశలో ఈ వుద్యమాన్ని నడిపింది కమ్యూనిస్టులూ వారితో సహకారంచేసి జైళ్ళకెళ్ళిన కాంగ్రెసువాదులు మాత్రమే. కమ్యూనిస్టుపార్టీ, రైతుసంఘం రహస్యసంఘాలుగా వున్నాయి. 1941 డిశంబరు 1942 జనవరిలో, కమ్యూనిస్టులను బలపరచేవారుగాని, వారితో సంబంధం లేదని తలపడ్డ కాంగ్రెసువారంతా జయిళ్ళ నుండి విడుదలచేయబడ్డారు కాంగ్రెసు బహిరంగంగా పనిచేస్తూంది. అందువల్ల ఆరోజుల్లో సహజంగా కమ్యూనిస్టు పార్టీపైన, రైతుసంఘంపైననిషేధం తొలగించమంటూ వుద్యమం ఒక ప్రత్యేకస్వరూపందాల్చింది.

రెండపదశలో కమ్యూనిస్టులేగాక కాంగ్రెసువారుకూడా జైళ్ళలో వున్నారు. కమ్యూనిస్టుపార్టీపై నిషేధం తొలగించడం కాంగ్రెసును నిషేధించడం జరిగింది. అఖిలమలబారు రైతుసంఘంపై నిషేధం అలానే వున్నా ఈ సంఘశాఖలు బహిరంగంగానే పనిచేయ సాగాయి. అందువల్ల ఈ దశలో ఆందోళన కమ్యూనిస్టు నాయకులను, కాంగ్రెసు నాయకులను విడుదల చేయించుటకూ, కాంగ్రెసుపై నిషేధం తొలగించుటకు కేంద్రీకరించబడింది.

ఈ వుద్యమాన్ని పరిశీలిస్తే దేశాన్ని ఐక్యపరచిన మూడు ప్రత్యేక ఆందోళనలు గోచరమౌతాయి.

(1) కామ్రేడ్ కె. పి. ఆర్. గోపాలన్ విడుదలకు జరిగిన ఉద్యమం.

నిజానికి కేరళరాష్ట్రంలోనే కాకుండా దేశమంతటా అన్నివర్గాల ప్రజలనూ ఐక్యంచేసిన మొట్టమొదటి ప్రజావుద్యమం యిది. విడుదలఅయ్యాడా కామ్రేడ్ గోపాలన్ అనే దృక్పధంతో చూస్తే ఈ వుద్యం అంతగొప్పది కాదనిపించినా, అతని ఉరిశిక్షను రద్దుచేయించి, యావజ్జీవ కారాగార వాసంగానైనా మార్చగలిగినంత బలకరమైన ఉద్యమం.

(2) కయ్యూరు కామ్రేడ్స్ విడుదలకు.—

ఈ ఉద్యమం కూడా అన్నిపార్టీల ఉద్యమంగా, కయ్యూరు కామ్రేడ్స్ రక్షణకమిటీకి పెద్దలుగా మితవాద కాంగ్రెసువారుండి పని చేశారు. కాని ఈ కమిటీ స్థాపించిన ఒకవారం రోజులకు జాతీయ సంక్షోభం రావడం, నాయకులు అరెస్టయిపోవడం, మొదలయిన ఘటనలతో ఈ ఉద్యమం ముందుకు సాగకపోయింది. అయినప్పటికీ రైతులూ, యితరవర్గాలు దేశం మొత్తంమీద వుద్యమాన్ని సాగించి, కేసుకు డబ్బు వసూలుచేసి ప్రీవీకౌన్సిల్ అప్పీలువరకూ వెళ్ళి వారిని రక్షించ ప్రయత్నించారు. కయ్యూరు కామ్రేడ్స్ ఉరితీయబడే ముందు కామ్రేడ్ పి. సి. జోషీకి తాము దేశంకొరకు, దేశరక్షణకు, యెలాంటి త్యాగానికైనా సంసిద్ధంగా వున్నామని తెలియజేశారు. జాతీయ రక్షణకొరకు ఆత్మవిధ్వంసక దళంలో చేరి త్యాగంచేస్తామని కూడా వ్రాశారు. కాని వారికి మరణదండన ఖాయం చేయబడింది.

(3) మూడవది, గాంధీగారు నిరాహారదీక్ష ప్రారంభించిన తర్వాత వారి విడుదలకు జరిగింది. ఈ వుద్యమం వివిధతరగతుల మధ్యవున్న అపనమ్మకాలను, అనైక్యతను ఛేదించి అన్నివర్గాల దేశభక్తులనూ ఐక్యపరచింది.

## ప్రజలకు తిండిపెట్టాలి

ఇదంతా ప్రత్యేకంగా కిసాన్ ఉద్యమంగాదు. రైతులు ఒకభాగంగా పాల్గొన్న జాతీయ ఉద్యమం యిది.

ఈ ప్రజాయుద్ధ దశలో రైతులకు ప్రత్యేక కార్యక్రమం వుంది. అదే అధికాహారోత్పత్తి. అన్నిరాష్ట్రాల రైతులకు భీటాలో జరిగిన అఖిల భారత రైతుమహాసభ ఈ కార్యక్రమాన్ని యిచ్చింది. సంవత్సరంలో 4-5 మాసాలు బర్మానుండి వస్తున్న బియ్యంతో జీవిస్తున్న మలబారు రాష్ట్రానికి ఈదిగుమతి రాకపోవడంవల్ల ఈకార్యక్రమంయొక్క ప్రాముఖ్యతను తెలియజేస్తుంది. 1942 డిశంబరులో మార్కెట్లలో యెక్కడా బియ్యం దొరకకపోవడం ఈ కార్యక్రమంయొక్క ప్రాముఖ్యత యెంతుందో తెలియపరచి, రైతుసంఘ కార్యక్రమంలో ముఖ్యమైన అంశమయింది అధికోత్పత్తి.

ఎప్పుడైతే రైతుసంఘ నాయకులకు కొంతవరకు రైతులను సమీకరించే వీలేర్పడింనో వారు వెంటనే యీ కార్యక్రమంపై దృష్టిని కేంద్రీకరించారు. సెప్టెంబరు ఆఖరువారంలో తిరువాన్కూరు, కొచ్చిన్, మలబారులలో అన్నితాలూకాలనుండి వచ్చిన రైతుసంఘ ప్రతినిధులసభ జరిగింది. కామ్రేడ్ నారాయణ నాయర్‌ను కార్యదర్శిగా వుంచి అఖిల మలబారు రైతుసంఘాన్ని స్థాపించ నిర్ణయించారు. తిరువాన్కూర్‌కు, ఇతరతాలూకాలకు ఆర్గనైజర్లు యేర్పరచబడ్డారు. కొచ్చిన్ కర్షక సంఘాన్ని అఖిల భారత రైతుసంఘ అనుబంధ శాఖ అయిన మలబారు రైతుసంఘానికి అనుబంధశాఖగా చేర్చుకొన తీర్మానించారు.

భీటా మహాసభ అధికాహారోత్పత్తిని గురించి యిచ్చిన కార్యక్రమం యెలా యిచ్చట అమల్లో పెట్టాలనేది ముఖ్యసమస్య. తుట్టతుదకు అధికోత్పత్తి జయప్రదం చేయుటకు తగినసూచనలు ప్రభుత్వాలకు యివ్వాలనీ, ఆ సూచనలను అమల్లోపెట్టించుటకు ప్రభుత్వాలతో రాయబారాలు నడపాలనీ తీర్మానించారు. అధికాహారోత్పత్తి కార్యక్రమాన్ని జయప్రదంచేయను స్థానిక రైతుసంఘాలు స్థానిక జన్మిలయొక్క, ఇంకా యితరులయొక్క సహకారం కొరకు ప్రయత్నించాలని తీర్మానించారు.

అందువల్ల రైతుసంఘం మలబారు టెనెన్సీ కమిటీ రిపోర్టులోని సూచనలను ఆచరణలో పెట్టమంటూ మద్రాసు ప్రభుత్వానికి ఒక మెమోరాండం పంపింది. ఎక్కువమంది ప్రతినిధులు బలపరచిన టెనెన్సీకమిటీ రిపోర్టును జన్మీలూ, కనామాదార్లు యింకా యితరవర్గాలవారు అంగీకరించారు గావున, అన్నిరకాల భూస్వామ్యవర్గాలకు సమాధానకరమైంది. యీ సలహాలలో ఒకటి యిది : జమీందార్ల స్వాధీనంలోవున్న బంజరు భూములు సాగుకు యివ్వాలనీ, సాగుచేయు రైతు 5 సం॥లు శిస్తు కట్టుకోవలసిన అవసరంలేదనీ, అంతేగాక జన్మీ యే పరిస్థితుల్లో కూడా రైతును భూమినుండి తొలగించకూడదనీ వుంది.

కాని, ప్రభుత్వం దీన్ని అంగీకరించలేదు. ఆహార సంక్షోభం పెరుగుచున్న యీ రోజుల్లో ఆహార పదార్థాలనుయెక్కువచేయడానికి యేకగ్రీవంగా అంగీకరించబడ్డ టెనెన్సీకమిటీ రిపోర్టును ఆచరణలో పెట్టుటకు ప్రభుత్వం సిద్ధంకాలేదు.

కాని స్థానిక రైతుసంఘాలు చొరవతో జన్మీలను, యితరవర్గాలను కలిపి పనిచేయ ప్రారంభించారు బంజరుభూములను సాగుకివ్వమని, శిస్తు విషయంలో రైతులకు కొంత రెమిషన్ ఇమ్మనీ, స్థానిక అవసరాలకు సరిపోయినంత ధాన్యం వున్నప్పుడే యితర ప్రదేశాలకు యెగుమతులకు అదనపుధాన్యం పోయేలా చూడమనీ జన్మీలను అడిగారు.

స్థానిక వ్యాపారస్తులను, సరుకులుదాచి యెక్కువ ధరలకు అమ్మకుండా జీవితావసర సరుకులు అందరికీ అందించి దేశభక్తికరమైన పాత్ర వహించమని అడిగారు. న్యాయమైన లాభాలు తీసుకొమ్మని చెప్పారు. ఉన్నసరుకులను యెలా అందరికీ పంచాలో తెలియజేస్తూన్న ప్లానులతో ముందుకువచ్చాయి స్థానిక రైతుసంఘాలు. స్థానిక అవసరాల లెక్కలుతీసి సరిపోయే సరుకులను ప్రజలకందించమని స్థానిక వుద్యోగులను ఒత్తిడి చేశారు.

ఈ పని రైతుసంఘం ఒక్కటే ఒంటరిగాచేయలేదు. ఎందుకంటే, యీ వుద్యమం కేవలం రైతుల హక్కులకొరకేగాదు, వుత్పత్తిగాని, 

యితర జీవితావసర సరుకులుగాని జన్మీలకూ, డబ్బువున్నవారికి, మధ్య తరగతికి, రైతులకు అందరికీ కావలసినవే.

అందువల్ల అన్నివర్గాలూ ఆహారకమిటీలు స్థాపించడంలోనూ, వాలంటీర్లను చేర్చడంలోను ఆహారసంక్షోభం పరిష్కరించను జరుగుతున్న యితర ప్రయత్నాలతోనూ సహకారం చేశాయి.

జన్మీలు యీ పరిస్థితుల్లో యింకా తమకు రావలసినదేదో అంతా రాబట్టుకోవాలని రైతులను పీడించడం, నిజానికి రైతులనే బంగారు గుడ్లు పెట్టే కోడిపెట్టను గుడ్లకొరకు చంపినట్లవుతుందనేది చాలా గ్రామాల్లో జన్మీలు గ్రహించారు. అందువల్ల జన్మీలు రైతులు కోరిన కొన్ని కోర్కెలను అంగీకరించారు.

ఇలా అధికోత్పత్తి కార్యక్రమం వుత్పత్తి అయిన పంటను సరిగా పంచడంకొరకు జరిగేకార్యక్రమంగా విశాలమైనఐక్యతను గ్రామాల్లో సృష్టిస్తూన్నప్పుడు, యీ కార్యక్రమంలో ప్రముఖపాత్ర వహించింది రైతుసంఘాలే. ఎక్కువమంది రైతులకు ప్రాతినిధ్యం వహించడమే గాకుండా, రైతుసంఘాలు బలమైన,నిర్మాణయుక్తమైన సంఘాలయ్యాయి. అందువల్ల రైతుసంఘాలు మలబారులో దినదినాభివృద్ధి చెందుతూ, ప్రజల ప్రాతినిధ్యాన్నివహించే సంస్థలుగా, నాయకత్వంవహించి నడిపించే ఆయుధాలుగా పెరుగుతున్నాయి.







## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA117B134 |
| పుస్తకం పేరు | మలబారురైతువుద్యమచరిత్ర |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 75 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | sowmya |
| పేజీలు విడదీసినది | sowmya |
| స్కాన్ చేసినది | Thasin |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |